శేషగిరిరావు

# చంద్రకాంత నాటకము

కాకినాడ, 1925

Record no. 173

Śēṣagirirāvu

Candrakānta Nāṭakamu

Kākināḍa, 1925

Record no. 173

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

# Bibliographic Record Target

శేషగిరిరావు.

శ్రీ చంద్రకాంత నాటకము / శేషగిరిరావుగారిచే రచియింపఁబడియె.- కాకినాడ : కాకినాడ ముద్రాక్షరశాల, 1925.

82p. ;20 cm.

Record no. 173

Śēṣagirirāvu.

Śrī Candrakānta Nāṭakamu /Śēṣagirirāvugāricē raciyimpam̐baḍiye.- Kākināḍa : Kākināḍa Mudrākṣaraśāla, 1925.

82p. ;20 cm.

Record no. 173

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB Date filming began:

శ్రీ

# కాంత నాటకము

ఇది

ల శేషగిరిరావుగారిచ
రచియింపఁబడియె.

ప్రకటనకర్త:

ందులగోవిందం,
జనరల్ బుక్కుడిపో,
బెజవాడ, కృష్ణాజిల్లా.



మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ.

మర్తి చినరఘుపతిరావుగారిచే
కాకినాడ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడిను.

1925.

[వెల రు 0-12-0

# సంగీత లంకాదహనము.

(గ్రంథకర్త, ద్రోణంరాజు సీతారామారావు

ఇందు, శ్రీరామలక్ష్మణులు సీతను గురించి మత్సుగ్రీవుల చెలిమిజేయుట, వాలిసంహారము, హను గాంచుట, రావణుని దర్బారు, విభీషణుని హితోపదే మంతుడు అశోకవిధ్వంస మొనర్చుట, రాక్షసులు హనుమనియొద్దకు గొని తెచ్చుట, రావణుడు హనుమంతుని వా లుజుట్టి అగ్నినంటించుమని జెప్పుట, రాక్షసులు యట్లు మంతుడు ఆవాలముతోనే లంకంతయు దహనముచే సంశములతో చక్కని శైలితో యింపగుపాటలతో త్వరపడుడు. వెల 0—10—0.

# సంగీత విష్ణులీల.

ఇందు మహావిష్ణువుయొక్క యవతారములన్ని బడినవి. ఏయవతారమునందు యేపనులు జేసినది వి బడినది. చక్కనిసాంగులు గలవు. భగవంతునియొక లన్నియు నిందు గలవు. త్వరపడుడు. యెన్నో ప్రతి

# అహల్యా శాపవిమోచనః

ఇందు అహల్యను గురించి ఇంద్రుడు పడుప శాపము, అహల్య పాషాణమగుట, శ్రీరాముని శాపవిముక్తి జెందుట మొదలగు సంశములన్నియు వివర బడినవి. చక్కనిపాటలు గలవు. త్వరపడుడు. వెల

## కందుల గోవింద

జనరల్ బు

# ఈనాటకమునందు వచ్చు పాత్రలు.

## పురుషులు.

చంద్రచూడుడు—రాజు.
బుద్ధిసాగరుడు—మంత్రి.
దూర్వాసుడు—
శివుడు—
పార్వతి—
సింహకేతుడు—రాజు.
మంత్రి—
కపటచంద్రకాంతుడు—
చంద్రకాంతుడు—
వనబాలకులు—
పంతులు—
బడిపిల్లలు—
రాజకుమారుడు—
మంత్రికుమారుడు—
అశ్వినీదేవతలు—

## స్త్రీలు.

రత్నమాల—
దేవి—

ఇకను భటులువగైరాలు సందర్భానుసారముగ వచ్చుచుందురు.

# నాంది.

---

గీ. ముజ్జగంబుల కెల్లను మూలమగుచు
ఆదిమధ్యాంతరహితుఁడై యలరునట్టి
దేవదేవుఁడు కరుణతో ధీరచరితు
లైన యీసభ్యులను బ్రోచు నఘముఁ బాపి.

(అని సభ్యులపైఁ బుష్పములఁ జల్లి సూత్రధారుఁడు నిష్క్రమించును)



శ్రీరస్తు.

# చంద్రికాంత నాటకము.

## ప్రథమాంకము.

[ప్రవేశము—చంద్రచూడుఁడును, మంత్రి బుద్ధిసాగరుఁడును]

### (1) అనుబంధము.

చం—అమాత్యశేఖరా!

చ. కూడును గుడ్డయున్ గలిగి కోరిక లెల్లను దీఱఁగా బ్రజల్
వేడుకఁ జాతులన్ విడచి వీడక ధర్మము లెల్లవేళలం
దాడక సత్యవాక్యముల నాశ్రితపోషకులయ్యు నిత్యమున్.
నాదుకచొప్పునన్ సతము భక్తిఁ గొల్చుచు నున్నవారలే.

రాజే ప్రజలకు దైవము. రాజే రక్షణకర్త. అట్టితఱి మన మించుక యేమఱిపాటున నుండి వారి సుఖమునకుఁ దోడ్పడకున్న రాజ్యమదాంధులమని యీలోకంబున నపవాదుల పాలగుట యేకాక ధర్మపరిపాలన కర్త యగు నాముల్లోకనాథునిచేఁ బరలోకంబున దండనఁ బొందుటయు సంభవించును గదా. భూపాలుఁడు పాలితులను గన్నబిడ్డలభాతిఁ గాంచుచు వారిసుఖమే తనకు సుఖకరమనియు, వారికష్టమే తనకుఁ గష్టమనియుఁ దలఁచి వర్తించునో యాతఁడు ఇల వన్నెకెక్కుటయే పరలోకమునఁగూడ సుఖించు ననుట నిర్వివాదాంశము.

మం—ఆర్యా !

గీ. దుష్టు లున్నను దండించి దుండగముల
నెల్లఁ బాఱఁద్రోలఁగఁ జూచి యెల్లవిధుల
సుజనపోషణకై పాటుఁ జూపు నృపుఁడు
బరఁగఁ గొఱఁతలు కూడునె పాలనమున.

ఇదియును గాక ప్రజలు తమలోఁ దమ కెట్టికయ్యంబులును లేక రాజభక్తియు నుదారస్వభావమును గలిగి వర్ణాశ్రమధర్మములను దప్పక వర్తించుచున్నవారలు.

(2) అనుబంధము.

చం—నిమఁబోలు సచివుని సహాయమున పాలన మొనర్చుచుండఁ గొఱఁతలు కల్గునా?

మం—రాజేంద్రా !

గీ. తావి గల్గిన బంగరు తనరురీతి
రాజు సద్గుణుఁడై యున్న రాజ్య మెప్డు
వన్నె కెక్కును గాదె యీ వసుధయందు
నిడుమ లుండునె ప్రజలకు నెంచిచూడ.

గీ. బీద లనువారు లే రెందుఁ బ్రేమతోడ
సోదరులభంగి మెలఁగెదు సుహృదయులును
భగవదారాధనల్ సేయు భక్తజనము
వరలుచున్నారు సంతోషవార్ధి మున్గి.

చం. మంత్రీ! ఎన్ని సంపద లున్నను, నెట్టివైభవము లున్నను నేమి ప్రయోజనము.

పలుకుల మోహపుచ్చి ముద్దుగ బాల్యమునందున రానురాను వి
ద్యలఁ గను నారికేళ మది ధార్మికవృత్తిఁ జెలంగఁ జేసియున్



కలకలలాడు మోములను గన్నులపండు వొనర్చునట్టి పు
త్త్రులఁ గనలేకయున్నతఱి దుర్భరచింతయె కాదె భూస్థలిన్.

గీ. సుతులు లేకున్నవారికి గతులు నాస్తి
యనెడు నార్యోక్తి వృథయౌనె యంధకార
కూపమట్టులఁ ద్రోచును పాపమేమొ
గడుప నగునె సంసారసాగరము గరము.

మం—సృష్టివైచిత్ర్య మెంతయు వర్ణనాతీతము కదా! ప్రతిమానవునకు నేదియో యొకకొఱఁత కల్గి యందుచేఁ జింత కలుగక మానదు. సర్వసంపదలఁ దులతూగుచు పుత్రోత్సాహాంబుధి నోలలాడుచున్నను బిడ్డలు లేరని యెడు చింతయో, కాక, వ్యాధులకుఁ జిక్కియో, వంతల ననుభవించుచుందురు. పిల్లలుగలవారికిఁ దినుటకుఁ దిండియే లేక, యపారదుఃఖముల ననుభవింపుచుందురు. ఇంతకును బూర్వజన్మమునఁ జేసిన పుణ్యఫలమైనను పాపఫలమైనను ననుభవింపక తీరునా? తాము శక్తివంచనలేక యనేకవ్రతములను సల్పుచున్నారు కదా. ఇంకను సర్వకృపామయుండగు నా పరమేశ్వరునకుఁ గరుణ కలుగకున్నది.

చం—సచివవరేణ్యా ! ఇంతదనుక—

గీ. వ్రతములను బెక్కు సల్పితి వరుసతోడఁ
గాంచనైతిని ఫలమును కమలనయను
కరుణయే లేకయుండెను కర్మమిట్లు
కూడియుండఁగ శుభముల కూడు టెట్లు.

మం—రాజేంద్రా! దైవానుగ్రహంబు వలనఁ గొలఁదిదినంబుల నే
కోర్కె నెఱవేఱును. ఇందుల కింతగఁ జింతిలనేల?

[ప్రవేశ మొక సేవకుఁడు.]

సే—(నమస్కరించి) రాజా! దర్శనార్థ మెవ్వరో యొకముని వచ్చి ద్వారమున వేచియున్న వాఁడు.

చం—(మంత్రివైపునకుఁ దిరిగి) ఎవ్వరై యుండును? ఎవ్వరైన నేమి? (సేవకుని గాంచి) సత్వరంబుగఁ బ్రవేశ పెట్టుము.

సే—చిత్తము. (అని నిష్క్రమించును.)

[ప్రవేశము దూర్వాసుఁడు.]

చం—ఆర్యా! నమస్కారము.

దూ—ఇష్టకామ్యార్థసిద్ధిరస్తు

చం—

గీ. పావనంబయ్యె జన్మము । పరమపావని
దర్శనంబున పాపంబు । తరలిపోయె.
సుదిన మనఁగ నిదియె కాదె । శుభవిచార!
పూజ సేయంగ సమకూడె । ముక్తి కలుగ.

దూ—రాజన్యచూడామణీ! ఇందు వింత యేమికలదు. నీ ఘనతయే యిందులకు మూలకారణము.

(3) వ అనుబంధము.

చం—మీయట్టి మునీశ్వరులకు నిర్హేతుకకటాక్ష ముద్భవించుట సహజమే కదా. (సేవకుని గాంచి) సేవకా! దేవి యింకను వచ్చుట లేదా?

సే—వచ్చుచున్నారు.

[ప్రవేశము—దేవి.]

దే—(దూర్వాసునకు నమస్కరించును.)

(అర్ఘ్యపాద్యంబుల నొసంగుచుఁ



చం—మహానుభావా! నా దొక కోర్కె కలదు. అద్దానిఁ దీర్పఁ బ్రార్థించుచున్నాఁడ.

దూ—సత్వరంబుగఁ దెల్పుము.

చం—

గీ. దర్శనంబున చేకూరె । ధన్యకీర్తి
శక్తికొలఁదిని విందును । సలుప మనసు
బుట్టె నీకోర్కెఁ దీర్పుఁడు । మునికులేశ
పావనత్వంబు నొందియుఁ । బరఁగుఁ గులము.

దూ—ఇందుల కింతగఁ బ్రార్థింపవలెనా? ఎంతయు సమ్మతియయ్యె.

చం—(పత్నిని గాంచి) దేవీ! సర్వమును సిద్ధపర్చుము.

దే—చిత్తము.

(అని లోనికేగి కొనివచ్చుచు.)

దూ—రాజా! పిల్లలు లేని పంక్తిని భుజించుట పాడికాదు. కాన, నీబిడ్డలఁ బిలువనంపుము.

చం—(తలవంచి) మునికులతిలకమా!

చ. అదియె మదీయచింత మది । మాఁరగ బిడ్డలు లేకయున్న నే
పదవులఁ గల్గియున్న మఱి । భాగ్యము లెవ్విధి నన్ను కూడినన్
యెదను విచారహీనుఁడయి । యెట్లు జనుండు మెలంగఁజాలు మీ
పదములు బట్టి వేడెదను । బాపవె చింతను మౌనిశేఖరా.

దూ—(క్రోధ మెదఁ దాల్చి, కన్ను లెఱ్ఱపడ) ఏమీమనుజాత్మా! ఎంత మోసకారివిరా?

గీ. పుత్రులే లేనియింటను । భుక్తి కెటులఁ
బిలువఁ దలపడి తీ విప్రు । భీతిలేక
మోసగింపఁగ నెంచితో । మూర్ఖచిత్త
రూపుమాపెదఁ గను మింక । పాపచరిత!

రాజ్యమదాంధుఁడవై, పుణ్యపాపవివక్షత నిసుమంతయును గనక, మాబోఁటిమునులఁ జుల్కనసేయ నెంతువుగా! ఇప్పు డెందుఁజొచ్చెదవు? ఎవరు నీకు శరణమగుదురో చూచెదఁగాక.

ఉ. భీతియె లేదొకో మదిని । పేర్మిఁగఁ జూచితివో యబద్ధముల్
భూతలనాథుఁడైన మఱి । భూరియశంబులఁ గూడుకొన్నఁ దా-
పాతకమంచుఁ జింతిలక । భావ్యమె వంచనసేయు టిట్లు భూ
నేతవు గాన నిప్పటికి । నిల్చితి; శాపము పాలు సేయకే.

4 వ అనుబంధము.

చం——మహాత్మా! ఎఱుఁగక చేసిన యీతప్పును దీనదయాపరులగు మీరలే సైరించి కావకున్న నిం కేమిదిక్కు కలదు? (అని పాదములమీఁది కొఱగును.

దూ——ఛీ! మూర్ఖా! నాతిపోమహిమం బెల్ల భగ్నమొనర్ప నెంచిన ని న్నేరీతి క్షమింప సమకట్టువాఁడ?

దే——(ముని పాదములపైఁ బడి)

గీ. దీనపోషక కావక । తీవ్రగతుల
నడలఁ జేయుట న్యాయంబె । హా కృపాళు!
కంచయే చేను మేసినఁ । గలదె దిక్కు
కరములను మోడ్చి మ్రొక్కెదఁ । గావుమయ్య.

దూ——(తనలో) వీరి దీనాలాపములఁ దిలకింప జాలివొడముచున్నయది.

ఋ——మానీంద్రా! ఒరుల మోసగింపఁ గలనైనఁ దలంపకుండెడి, మా రాజేంద్రుఁ డొనర్చిన యీతప్పిదమును గాచి రక్షింపుఁడు. మహానుభావా! తామే యిట్లకారణంబుగఁ గ్రోధమూని శిక్షఁ బదలపడిన నింకఁ బ్రోచువా రెవ్వరు? మీయట్టి తపోధనులు, కన్ను లెఱ్ఱజేసిన లోకంబులే దగ్ధమగుచుండ, నింక [illegible] యెక్కడి దిక్కయా?



దూ——రాజా! క్షమింపఁబడితివి. ఇం కెన్నఁ డిట్టియపరాధముల సలుపకుము. ముందుగ నిందారగింతునని నుడివి, యిప్పు డొల్లకున్న నసత్యతదోషము సంభవించును. అందుచే సలిలభక్షణ మొనర్చెదను. (అని యట్లొనర్చును.)

చం——ఎంతయు ధన్యులమైతిమి. ఋషిపుంగవా!

సీ. పుత్రసంతతి లేక । భూరిసంపద లెన్ని
కూడియున్నను జింత । కూడకున్నె.
సుతులు లేకున్నను । సుఖము లపారమై
కూడియున్నను జింత । కూడకున్నె
కొమరులఁ గనకున్న । గుణము ప్రసిద్ధమై
కూడియున్నను జింత । కూడకున్నె
తనయులఁ బడయక । ధన్యత యంతయుఁ
గూడియున్నను జింత । కూడకున్నె

గీ. యట్టి దుర్భరచింతల । నవల కనిపి
పుత్రభిక్ష నొసంగవే । మునికులేశ!
బ్రదికియున్నంతదనుకను । ఘోర మిలను
పిదప నరకమె ప్రాప్తించి । పేర్చు కాదె.

ఈ భరింపరాని, నా యార్తిని దీర్ప ప్రోవఁ దపోధనసంపన్నులగు మీరలు కాక యెవ్వరగుదురు? మానీంద్రా! దయాపరులై, మీ దర్శనఫల మనుభవింపఁజేయఁ బ్రార్థించుచున్నాఁడను.

దే——మునికులతిలకా! ఇతర సంపద లెన్ని కూడినను,

గీ. కష్టముల కోర్చి బ్రదుకంగఁ । గలను గాని
కఠినవానిందలను దాల్పఁ । గలను గాని
కడకు నైశ్వర్యముల విడఁ । గలను గాని
కనక పుత్రుల నే నెట్లు । గడపుదాన.

ఏమైన నీవర మిచ్చి రక్షించునందాక మీపాదముల వీడఁజాల. (అని పాదములపై నొఱగును.)

5 వ అనుబంధము.

దూ—(తనలో) వీరి యార్తానినాదములఁ దిలకింప జాలి వొడముచున్నయది. దీనజనపోషణయే లేకున్న నిందపాలుగుట నిక్కువము. (ప్రకాశముగా) సుదతీరత్నమా! ఏ నొక యుపాయమును దెల్పెదను వినుము. అందువలన మీకోర్కె తప్పక నెఱవేరును.

చం—దే—మహాప్రసాదము.

దే—

గీ. తండ్రియే కోర్కెఁ దీర్పఁగఁ దలపకున్నఁ
బ్రోచువా రెవ్వ రింక నీభువిని దనయ
కన్నతల్లియె బిడ్డను గఠిన మూని
మ్రింగఁజూచినఁ దెరువున్నె మెలఁగ నింక.

దూ—రాజా! ఈ యుపవనముల కేగి, సర్వసముండును, దీనరక్షాపరుండును, భక్తపోషకుండు నగు నాపరమేశ్వరునిగూర్చి తపం బాచరింపుము. అతఁడు నీభక్తికి మెచ్చి, ప్రత్యక్షమై తప్పక నీకోర్కె యీడేరువరం బొసంగును. చాల తడవైనది. ఇఁక నేఁ బోయివచ్చెదను.

చం—ఆర్యా! తమ కరుణాకటాక్షవీక్షణంబులఁ బడయ నేమికొఱంత లుండును. మీ యాజ్ఞానుసార మిప్పుడే తరలెదను.

దూ—మంచిది. శుభమగుఁగాక. పోయి రమ్ము.

(అని చెప్పి నిష్క్రమించును.)

చం—మంత్రివరా! తొలుతఁ గీడుగఁ గాన్పించినను, సజ్జనసాంగత్యమున సుఖములే యలవడును సుమా.



బు—రాజేంద్రా! పుణ్యపురుషుల కెందును యిడుమలు ప్రాప్తింప నేరవు. ఒకవేళ సంప్రాప్తమైనను క్షణకాలంబుననే విముక్తియుఁ గల్గును.

చం—ఇఁకఁ దడవొనర్పక, తప మొనరింప నేగెదను. నేఁ దిరిగివచ్చునందాక యీ రాజ్యభారమును వహింపుము.

బు—

గీ. భారమేయైన రాజ్యపరిపాలనమును
తావకాజ్ఞానుసారినై ధర్మభంగి
శక్తివంచన లేకుండ సలిపి జనుల
కన్నబిడ్డలభాతిని గాంచుచుందు.

చం—(పత్నిని గాంచి) దేవీ! ఇఁక నీ వంతఃపురమునకుఁ బోయి, భగవదారాధనాప్రవృత్త వగుము. ఈమునీంద్రుని పల్కులు వ్యర్థములు కావు. శక్తివంచన లేక యత్నము లొనరించిన పిదప సర్వకృపామయుండగు నాపరమేశ్వరుని మీఁదనే భారము వైచి యుండవచ్చును.

దే—ఆజ్ఞకు బద్ధురాల.

(అందఱును నిష్క్రమింతురు.)

యవనిక జారును.

ఇది ప్రథమాంకము.





శ్రీరస్తు.

# చంద్రకాంత నాటకము.



ద్వితీయాంకము.



ప్రదేశము:—అరణ్యసీమ

[ప్రవేశము:—చంద్రచూడుఁడు పరమేశ్వరునిఁగూర్చి తదేకనిష్ఠతో ధ్యాన మొనర్చుచు]

చం—సర్వేశ్వరా! భక్తపరాధీనా!

6 వ అనుబంధము.

సీ. జీవకోట్లకు నెల్ల । జీవనాధారమై
పరఁగుచుండెడు పర । బ్రహ్మమనఁగ
ఆర్తజనులఁ జేరి । యాయాసములఁ బాపి
సంరక్షణను జేయు । స్వామి యనఁగ
భక్తపరాధీన । భక్తుల హృదయాన
డాగియుండెడు నట్టి । దైవ మనఁగ
దుష్టశిక్షణయును । శిష్టరక్షణయును
ముదమార సల్పెడు । మూర్తి యనఁ
గీ. నెప్పు నీవయే నాదగు । ముప్పు వాప
దిక్కటంచును నమ్మితి । దేవదేవ!
కనులఁ దెఱచిన సృష్టియా । కనుల మూయ
నాశనం బౌను జగములు । నీశ కావు.



ఆపద్బాంధవా! సృష్టిస్థితిలయకారణుండవై యత్యంతభక్తిని గొల్చు నా మహామునీంద్రులనుమాత్రము కనులఁ గప్ప నసమర్థుండవై తక్కువారిని నీ మాయాప్రభావమునఁ గనులఁ గప్పి సకలంబునకును దానే కర్త ననియెడు యూహలఁ గల్గించి యీ మాయాలోకవిలోకనంబునఁ బడఁజేయువాఁడవు నీవ కావా? నీమహిమంబు నించుకయు గ్రహింప నేరని మూఢాత్ముఁడను. దీనుఁడను. నా మొరాలించి నన్నుఁ బ్రోవ సమకట్టుము. తండ్రీ! నా యీయార్తిని నీవే తీర్పకున్న నిఁక నిందుండి యుద్ధరించువా రెవ్వరు? ముజ్జగంబులకును కర్తవై చరించు నీవయే నిర్దయత్వ మెదనూని యెంతగఁ బ్రార్థించినను బెడచెవిని బెట్టిన నింకేమి తెరువు? జ్ఞానేంద్రియులనే మోసగించు మహిమఁ గలవాఁడవు నిన్నుఁ గనుఁగొన నా తరమగునా?

ఉ. భోగము లెన్నియున్న నిఁక । భూరిసుఖంబులఁ దేలుచున్న నే
యాగము లెంచిచేసినను । యాసలు దీరుచుఁ బొంగుచున్న నే
యోగులఁ జేరి సేవలను । నోర్పుతో సల్పుచు నాటితేటినన్
యేగగ నిన్నుఁ జేరఁగను । యెవ్విధిఁ జేకురు భక్తపోషణా.
గీ. శరణు వేడితి శంకర । సచ్చరిత్ర
దర్శనం బిచ్చి బ్రోవవే । దండధరుని
జేరకుండంగఁ బుత్రుని । జేర్చి నాకు
నిహపరసుఖంబులను నెల । యింపుమయ్యా!

(అని ప్రార్థింప శంకరుఁడు, పార్వతియుఁ బ్రత్యక్షమగుదురు.)

చం—(కనులఁ దెఱచి వారి పాదములమీఁది కొఱగి)

గీ. ధన్యుఁడను నేను భవదీయ । దర్శనమున
పరమపూరుష యెదఁగల । భక్తి నెంచి
కృపను వీక్షింప నెంచవే । కోర్కెఁ దీర్చి
కావవే! యీశ్వరా! హర! । కామవైరి!

శి—ఉ. మెచ్చితి నీదు భక్తికిని । మీరిన చింతల వీడుమయ్య నే
నిచ్చెదఁ గోరు మొక్కవర । మెయ్యదియైనను నేఁడె ప్రీతితో

చం—దేవా!

చెచ్చెరఁ గోరుచుంటి దయ । సేయుము పుత్రుని సచ్చరిత్రునిన్
వచ్చితి నట్టికోరికను । వాంఛను దీర్పుము లోకనాయకా!

శం—రాజా! నీకోరికఁ దీర్చుట దుర్భరమే కాని ముందుగ వర మిచ్చెద నంటిని కాన, నీకుఁ బుత్రుఁడు జనించును. కాని యాతఁ డల్పాయుష్యవంతుఁ డగును

చం—దేవా! ఇదెక్కడివరము?

గీ. పుత్రుఁడే పుట్ట వర మిచ్చి । పుట్టినంత
గిట్టునంచును దెల్పిన । నెట్టు లోర్తు
నూరటఁ బుచ్చ నీరీతి । నూహఁ జేసి
పనుప నెంచుట తమ కిది । పాడియగునె.

పా—(భర్తను గాంచి) నాథా! ఇట్టివింత యెందైనఁ గలదా? ఈ రాజేంద్రుఁడు పుత్రునికై, కష్టములకెల్ల నోర్చి, మాయందే మనము నిల్పి తప మాచరింప, వరమీయ నుద్యుక్తులయ్యుఁ దుద కల్పాయుష్యవంతుఁ డగునని నుడువుట యేటిన్యాయము?

శం—ప్రాణేశ్వరీ! అట్లు కాదు. కొండొకకతంబున నేనే యీతని గర్భవాసమున జనింపవలసి వచ్చెను. అట్టియెడ నెంతయో కాలము ప్రాణసమానవగు నిన్ను విడనాడియుండు టెట్లు?

పా—మీసంశయ మిదియే యైన—

గీ. జననమందితి సింహకే । తునకు సుతగ
శంక లేటికి భూస్థలి । సంతసమున
నిరువురముఁ గొంతకాలంబు । పరగు టొప్పుఁ
గాన వరమిచ్చి పనుపుడు । కనికరమున.



శం—అట్లే కావించెద. (ప్రకాశముగా) రాజా! నీ దీనాలాపములకు నామనము కరగినది. నీకుజనించిన సుతునకుఁ బన్నెండు దినములు మీరకుండఁగనే, పన్నెండేండ్ల బాలికను బరిణయ మాచరించినఁ బూర్ణాయుష్యవంతుఁడై వర్థిల్లును. పొమ్ము. ఇఁక మే మేగెదము.

చం—(తత్తరముతో వెంటఁబడి) దేవా! ఇట్టి యద్భుతచర్యల నెట్లాచరింప సమర్థుఁడ నగుదును?

శం—అదియును సంప్రాప్తమగును.

చం—మహాప్రసాదము.

(7) అనుబంధము.

(అందఱు నిష్క్రమింతురు.)

(తెర పడును.)

## రెండవ రంగము.

---

శోణపురప్రాంతము.

[ప్రవేశము:—బుద్ధిసాగరుఁడు.]

(8) అనుబంధము.

బు—ఎట్టిదుర్ఘటంబగు కార్యమైనను బూనికతో నెఱవేర్పఁ బాల్పడిన నసాధ్య మగునా? అట్టితఱి దైవసహాయము కూడ సమకూరిన నింకఁ గొఱఁతలుండునా? ఈ మహారాజెన్నెన్నియో వ్రతముల సల్పుచు, భక్తిశ్రద్ధలతో దేవదేవు నర్చించుచుఁ దుదకు నేఁటికి దనకోర్కె యీడేర సంతసాంబుధి నోలలాడఁ జొచ్చెను. అయినను, ముందున్నది ముసళ్ళపండు వనునట్లు, ఇఁక ముందు జరుగవలసిన విధానమే యొక్కఁడు కష్టతరము

గన్పట్టుచున్నయది. పరమేశ్వరుని వరప్రసాదమునఁ బుట్టి యెన్నియిడుములందినను ఫలము చేకూరుట నిక్కము. పండ్రెండు దినములు దాటకుండఁగనే పరిణయ మాచరింపవలె నఁట. కడుదుర్లభకార్యము కదా! దేశదేశములు తిరిగి తిరిగి వేసారితినేగాని, యింతదనుక నట్టికన్యయే పొడఁగట్టదాయె. ఈ సింహకేతుని కట్టిఐనయ యొకతె కలదని వింటిని. ఈ వృత్తాంతమంతయుఁ గప్పిపుచ్చి యేరీతి వీరలమోసగింపనగును. (ఆలోచన నభినయించి) సంశయమేల? నా సుతుని పటము నాయొద్దనే యున్నది కదా. ఈతఁడే యీ రాజనందనుఁడని తెలిపి సమయానుకూలముగ వర్తించెదను. ఎచ్చటను కని విని యెఱుంగని వింత యొనర్ప సంసిద్ధుఁడ నగుచుంటిని. సత్యమును గ్రహించినవేళ నావనిత నన్నెంతగ దూరునో? పతివ్రతా శిరోమణియై శాపమే యొసంగిన దగ్ధుఁడఁ గావలసినదే కదా.

ఇది ద్వితీయాంకము.





శ్రీరస్తు.

# చంద్రకాంత నాటకము

## తృతీయాంకము.

సభామంటపము.

[ప్రవేశము:—సింహకేతుఁడు, మంత్రి.]

సిం—మంత్రీ! రూపపటమును గైకొనిపోయిన చారు లింకను రాకఁ దడయుటకు హేతు వేమియో?

సీ. సంతతి లేదంచుఁ । జింతలఁ జిక్కియుఁ
గుందుట కొన్నాళ్ళు । కోర్కెతీర
బెంచి పెద్దలఁ జేయు । పిదప వేఱొకచింత
అదియుఁ దీర పిదప । నబలయైన
తగినవరునిఁ గూర్ప । ధర నెల్ల వెదకియుఁ
బెండిలి సేయుంగఁ । బెద్దచింత
అభివృద్ధికై మది । నావహింపఁగఁ జేసి
పెక్కురీతులఁ జూడ । నొక్కచింత
గీ. ఇన్నిచింతలఁ జిక్కుచు । నెన్నరాని
సారహీనమౌ సంసార । సాగరంబు
దాటి చరియింప నెట్టులో । ధరణి నింకఁ
జేరి వీడంగఁ దగుదురే । ధీరులైన.

మం.—ఆర్యా! అట్లే కాకయున్న నీమాయాప్రపంచకనటన జరుగుట కెట్లలవడును? భగవత్సృష్టియు నిరర్థకం బగును. ప్రతివారికి నొక్కొకప్పుడు తీరరాని కష్టము లొదవ, వైరాగ్యసంపద చేరి యాసలడంప యత్నించును గాని తిరుగ నాక్షణంబుననే, మాయ నట్టుముట్టి యట్టిమాతనయుద్దేశ్యముల వెడలనడపును. నిష్కళంక హృదయులై నీరజాక్షుని కట్టెకుటఁ గట్టుకొని యుండు మహామునీంద్రులును నొక్కొకసమయంబున మోసగింపఁబడుదురని వినియుండలేదా? ఇదియుఁ గాక, యిందుల కింతచింత నెదఁ దాల్ప నేల?

గీ. వనిత నేర్పాటుఁ జేసిన బ్రహ్మ తాను
వరుని బుట్టింపకుండునే వసుమతీంద్ర
యెంత వెదకినఁ గడకును బంతమాని
ధాత తలఁచిన వానికై దరలవలయు.

అంతటి ధైర్య ముంపఁజాలని జ్ఞానశూన్యుల మగుటచే, నెల్ల వేళల దదేక ధ్యానంబునఁ జింతాపరులమై తిరిగితిరిగి, కడ కొక్కనిఁ జేరఁ గల్గుదుము. కొనసాగిన పనులన్నియు, నిజదార్ఢ్యమహిమచే వెలుగందుచుండెననియు వ్యర్థమైన భగవదాధీనమనియుఁ, దలఁచుట మానవులకు సహజమే కదా.

సిం.—అట్లే కాని నాముద్దులపట్టి యగు రత్నమాల నవలావణ్యాశోభితయై, భువనమోహినియో యనునట్లు వెలుగందుచున్నది. ఈపెకుఁ దగినవరుఁ డెటులభించునో కదా. ఎందఱెందఱి రాకుమారుల రూపఫటములనో తిలకించితిమి కాని, యొడంబడ నాకే యిష్టముగాకుండె. ఈకోర్కెయు నిరాఘాటముగఁ దీరిన నికఁ గదా ధన్యుఁడనని యుప్పొంగుట.

(తెరలో) సింహకేతుమహారాజుగారికీ జయ్.



సిం.—చారులు వచ్చుచున్నటులున్నది.

మం.—ఏను నట్లే తలఁచితిని.

[ప్రవేశ మిరువురు చారులు.]

చా.—(కొన్నిపటముల మంత్రికి యొసంగును.)

మం.—(అందొకటి రాజునకుఁ జూపి, రాజేంద్రా! ఈపటమును దిలకించుడు.

గీ. మన్మథాకృతి వెలుగంది మానవతుల
మనములనుమాత్రమే కాక మనలఁ గూడ
మోసగింపంగఁ జాలెడు ముద్దుమోము
తగును యీతఁడె మీ ముద్దు తనయ కింక.

సిం.—నీవన్నటు లన్నివిధములఁ దగియుండెను గాని,

గీ. అబలుఁ డీతఁడు చూచితే యబల లెప్డు
రూప సౌందర్య మెటులున్న రోసివలెను
బలపరాక్రమములు లేక పరఁగువాని
చేరనొల్లరు తమమదిఁ జింతఁ జేర్చి.

మం.—అదియును సహజమే. ఈ రాకుమారుని గాంచుఁడు.

గీ. కడుబలాఢ్యుఁడు యీతఁడో కలఁచిచూడ
విద్యయున్నట్లు తోఁపదు వీరుఁడగును

సిం.— ఎంతబలమున్న సంపద లెన్నియున్న
విద్య లేకను బూజ్యుఁడై వెలుఁగు నెవఁడు?

[ప్రవేశ మొక భటుఁడు.]

భ.—మహారాజా! చంద్రిమూడ మహారాజుగారి మంత్రింగాట పేరు బుద్ధిసాగరుఁడట. ఆజ్ఞకై ద్వారమున వేచియుండెను.

సిం.—సత్వరంబున రావింపుము.

భ—(లోనికిఁ జూచుచు) అయ్యా! రాజాజ్ఞ అయినది. దయచేయుఁడు.

[ప్రవేశము:—బుద్ధిసాగరుఁడు]

సిం—సచివవరేణ్యా! ఆ పీఠము నలంకరింపుము.

బు—(అట్లు చేయును.)

సిం—మీ రాజేంద్రునకును, మీకు నెల్లరకును కుశలమే కదా.

బు—రాజా! అందఱకును క్షేమమే.

సిం—అకారణముగ నొకనును బోకుండెడి మీ రాక కెద్దియో తగిన హేతువుండవలెను.

బు—అగును. కార్యార్థుఁడనై యరుదెంచితి. మా రాకుమారునకుఁ బా్రడెండు వత్సరముల ప్రాయము గల్గిన యొక బాలారత్నమును వెదకి పరిణయమాచరింప, రాజాజ్ఞ ననుసరించి బయలు వెడలితిని.

సిం—మీవలెనే మేము వరునికై వెదకుచుంటిమి.

బు—మీపుత్రిక కెన్నివత్సరముల వయస్సుండును?

సిం—పదమూఁడును బూర్తియై, పదునాల్గవవత్సరము ప్రారంభమయ్యె. మీ రాకుమారుని పటమును గొనివచ్చితిరా? ఈ పటమును దిలకింపుము. (అని రత్నమాల రూపపటము నిచ్చును.)

బు—(జేబునందున్న పటమును దీసి యిచ్చును.)

సిం—(మంత్రికి జూపుచు)

గీ. సోయగంబున మించెను సురలఁగూడ
బలపరాక్రమశాలియై వసుధ నిట్టి
సౌకుమార్యుని గనఁగ న శక్యమాను
అన్నిరీతులఁ దగియుండు నతివ కితఁడు.

(బుద్ధిసాగరుని జూచి) ఆర్యా! ఈతని నామ మేమి?



బు—చంద్రకాంతుఁ డందురు.

సిం—నామమును గాంతికి దగినట్లుగనే యున్నది.

బు—రాజా! సర్వవిధముల నీదాంపత్యము సరియై యున్నది. ఇఁకఁ గాలయాపన మేల? సత్వరంబున నీశుభ మొనఁగూడ యత్నించుటయే యెంతయు శుభదాయకం బగును.

సిం—అమాత్యశేఖరా! మీపల్కుల నెంతయు ధన్యులమైతిమి. శుభదివసంబునఁ బెండిలికి తరలివచ్చుటయే యిందుఁ గర్తవ్యము.

బు—మహాప్రసాదము. పోయి వచ్చెదను. (నిష్క్రమించును.)

సిం—మంత్రీ! నీవన్నపల్కులే సత్యములయ్యెను. మన మెంతగ వెదకి వెదకి వేసారితిమి? భగవానుఁడే తుదకు దారిఁ జూపెను. ఇఁకముందు జరుగవలసిన విధానమునకై తలపడవలె.

(అని యిరువురును నిష్క్రమింతురు.)

(యవనిక జారును.)

పురవీధి:—[ప్రవేశ మొక విప్రుఁడు.]

విప్ర—కలికాలమహిమయన నిదియే కాఁబోలును. పెండ్లికొడుకు లేకయే పెండ్లికావలె నన్నరీతిగ నున్నది. ఇదితప్పక చంద్రమూడుఁ డొనరించిన మోసమే కాని వేఱొండు కాదు. కాకున్న నొక పెట్టెను జూపి తమయిష్టదైవ మందుండెననియు, నా పెట్టెపైని పూలహారం బిడుమనియుఁ జెప్పు టేటిన్యాయము. లెక్కకు మిక్కుటం బగు పెండ్లిండ్లనేకముఁ జేయించితిని కాని యిట్టి వింత లెన్నఁడును గని విని యెఱుంగను. ఈరాత్రికాలమున శోభనమగును గదా. అప్పుడైనఁ బెండ్లికుమారుని జూపక యెట్లు మోసగింపఁజూతురో చూచెదఁ గాక. ఇందువలన నా చంద్రమూడునికి భయముఁ గొల్పి కొంతధనమును లాగవచ్చునని సంతస మొదవుచున్నయది. (అని నిష్క్రమించును.)



శ్రీరస్తు.

# చంద్రికాంత నాటకము.



## చతుర్థాంకము.



### కేళికాగృహము.

[ప్రవేశము:—రత్నమాలయును, జెలికత్తె కనకాంగియు]

కన—అమ్మా! కలువలఱేని కాంతి ప్రసరించి, కలువలు వికసింప సమయమగుచున్నయది.

రత్న—అన నీయభిప్రాయ మేమి?

కన—అభిప్రాయమున కేమున్నది?

రత్న—ఎంతచమత్కారివే.

కన—నా చమత్కారమున కేమిగాని, నీ చాకచక్యములు జూపఁ దగుసమయము.

రత్న—సఖీ! ఎంతప్రొద్దైనది.

కన—ఇప్పుడేకాదటమ్మా జాముగంట వినఁబడినది.

రత్న—అయ్యో! ఇంకను జాముప్రొద్దైన మీఱలేదా!

కన—అగును. కోర్కె లీడేరునందాక, కాలమును గడపుట కష్టతరమే.

రత్న—(దరహసితవదనయై) సఖీ! నీ వేళాకోళములఁ గొంతసేపు కట్టిపెట్టుము.

కన—[illegible]మే లభించుచో నాహారము రుచించునా?



రత్న—(ఇంచుక తడఁబాటు నభినయించును.)

కన—తడఁబడుచుంటివేల? ఓహో తెలిసినది. ఏదియో యనుగుల యలుకుఁ డగుచున్నది.

(9 అనుబంధము.)

[ప్రవేశము:—కపటచంద్రికాంతుఁడు]




(10 అనుబంధము.)

చం—(తనలో) ఆహా! నేఁ డెంతదుర్దినము? జనకుని యాజ్ఞానుసారముగ మెలకువతో వర్తించి, ధీరచిత్తుఁడనై, మోహపాశంబులఁ దగుల్కొనక, యిటనుండి తప్పించుకొనిపోవుట యురగమునోటఁ జిక్కి బ్రదికిపోవుట యగును గదా. ముల్లోకంబుల కెవఁ డాధారభూతుఁడై, సకలాంతర్యామియై, మనంబులెల్లఁ దిలకించుచుఁ బుణ్యాపాపవివక్షుతలఁ గనుచుండునో, యాదేవదేవుఁ డీవేళ నాకుఁ దోడునీడయై, మనసు చలింపకుండఁ బ్రసాదించును గాక. ఓ కామదేవతా! ఈవు నాయుండ నుండకుము. నీ కనేకవేల వందనము లర్పించెదను. ఎట్టిధైర్యమూనిచరింతమన్న నాందోళన మంతకంత కతిశయించుచున్నయది. మానసమా! చెలచిత్తవు కానుండుము.

ఉ. అక్కట! యెట్టులౌను ముద మారగఁ గౌఁగిలి యిమ్మటన్న
ప్రక్కను జేరువాఁడ మది భావనకేమని ప్రశ్నఁజేయు నే
టక్కరి దాఁటఁగానగును తథ్యము మోసమొకల్గు టియ్యెడన్
మక్కువఁ జూపుచున్ మగువ మానస మెట్టులఁ ద్రిప్పఁజాలుదు

ఓ హృదయమా!

గీ. ధైర్యమందుచుఁ జతురతఁ దాల్చు మింక
తల్లియని యెంచు మీనాతి ధరణి ఖ్యాతి

నందు టుచితంబు కాకున్న నఖిలదుఃఖ
భాజనం బౌట సత్యంబు భారమగుచు.

(రత్నమాల సిగ్గున నొకప్రక్కకుఁ దొలఁగఁబోవును.)

కన—(పట్టుకొని) దేవీ! ఏమిది తొలఁగిపోవుచుంటివి? ఆశ ముందునకు సిగ్గు వెనుకకు లాగుచున్నది కాఁబోలును. చాలుఁ జాలు. పోయి యాహ్వానింపుము.

రత్న—నాకు మాఱుగ నీవేగి యర్చింపుము.

కన—మాయర్చనల నారాకుమారుఁ డొల్లకుండిన.

రత్న—హేతు వేమి?

కన—ఈ వృధాకాలయాపన మేల? నీవు వేగిరముగఁ జేరకున్నఁ గోప మావహింపవచ్చును.

[తెరలో]

ఓసీ! కనకాంగీ! రమ్ము. రమ్ము. త్వరితముగ రమ్ము.

కన—(పోఁబోవ, రత్నమాల కొంగును బట్టుకొనును.)

రత్న—సఖీ! నన్నొంటరిగ వీడి నీ వెక్కడికే?

కన—ఇప్పుడే తిరిగి వచ్చెదను. చూచు మటు చూచుము. (అని యేమియో చూపుచున్నట్లభినయించి యటనుండి తొలఁగిపోవును.)

రత్న—(మెల్లగ) ఎంతమాయలమారివే? (తనలో) నామనోనాయకుఁ డట్టులే నిలువఁబడియుండెను. అయ్యో! దరిఁజేర మానస మెంత తొందరపడుచున్నను, యీపాడుసిగ్గు యడ్డఁజేరి ముందన కడుగిడనీయకున్నది. (ప్రకాశముగా) నాథా! (అని యూరకుండును.)

చం—(తనలో) అయ్యో! ఎట్టి వినరానిపల్కులు వినవలసి వచ్చెను. ఈవనిత యొకపటపునాటకమును దెలిసికొననేరక నాథా! యని పలుకరింపుచుండెను.



రత్న—నాథా! మీదర్శనలాభ మెన్నటికి సమకూడునో యని తహతహపడుచు వేచియున్న నారత్నపీఠ మలంకరించి, యార్తిఁ దీర్పుఁడు.

చం—(తనలో) ఏమిసేయువాఁడ?

రత్న—(తనలో) ప్రత్యుత్తరమే లేకున్నది. కతం బేమియో? కాలయాపన మొనర్చితినని క్రోధమే జనించెనుగాఁబోలును.

రత్న—ప్రాణేశ్వరా! తప్పులున్న సైరించి, యాపీఠమున నాసీనులు కండు.

చం—(ఇఁక నూరకుండుట పాడిగాదు.) అబలా! కులాచారము ననుసరించి మాయిష్టదేవతనే యందుంచి యలంకరింపఁ జేసెదను.

(అని దగ్గరనున్న పెట్టెను దానిపైనుంచి తాను వేఱొకచోఁగూర్చుండును.)

రత్న—(తనలో) ఆహా! వీరి దైవభక్తి యెంతయు వర్ణనాతీతము కదా. ఇట్టి పురుషుఁడు భర్తగాఁగ నెట్టిపుణ్యము లాచరించి యుంటినో? (సురటిఁ గైకొని విసరఁదొడఁగును.)

చం—కాంతారత్నమా! నా కేటికీయుపచారములు? ఇష్టదేవతా ప్రీతి యొనర్పుము. అందువలన నిహపరసాధన మగును. (అని తొలఁగును.)

రత్న—(తనలో) ఇదంతయుఁ జూడ నేకతంబుననో నన్ను మోసగింప యత్నించుచున్నటులఁ గన్పట్టుచున్నయది. (ప్రకాశముగా) ప్రాణేశ్వరా!

(11 అనుబంధము.)

ఉ. కోపము కల్గెనో మదిని కూడెనో నిర్దయ హేతువేమి [illegible]రా
పాపము మేలమాడ నిటు భావనలేమియొ కాంచఁజాల నీ
చాపునఁ జేరినంత సుఖదాయకమే యని యెంచియున్న నన్
బ్రోవున నాదరింపకను బాములఁ బెట్టుట పాడిక

దైవభక్తి యుండిన నుండవచ్చునే కాని, యిూరీతి నిర్దయాపరులై, యిమ్మె దైవమని యెంచి, చేపట్టిన నొకయబల నవలఁద్రోయుట పాప హేతువు కాదా ?

గీ. తప్పిదములున్న నోర్పుమై - తగదటంచు
బుద్ధిగఱపియుఁ దోలఁగింపఁ - బోల్పు కాదె ?
అంతియేకాని, యిూరీతి - నడలఁజేయు
టేటిన్యాయంబు ప్రాణేశ - యీర్ష్యలేల?

(అని డాయఁబోవఁ దప్పించుకొని)

చంద్రి—
చ. అతివరొ శాశ్వతంబులని - యాసలఁ జిక్కి యశాశ్వతంబులో
సతిపతులంచు సౌఖ్యముల - జాలమొనర్చుచుఁ జావుపుట్టుకల్
మతిభ్రమ జేయుచుండ నిటు - మానక యార్తిని సొక్కనేటి కీ
క్షితి నిలుపంగ జీవముల - క్షేమమె కల్గఁజేయ శక్యమే.

క్షణభంగురంబులగు నీ యిహలోకసుఖముల కాసించి, శాశ్వతస్వర్గ సౌఖ్యములకు దూరమై, దుఃఖాకులంబగు సంసారాంధకారమున దగుల్కొని, దరిఁ గానలేక చింతలఁ జిక్కుచు, మోహవారిధిని మునింగి, లెక్కకుమిక్కుటంబగు చావుపుట్టువులకు లోనగు టెంత వెఱ్ఱితనమో యోజించుము.

(12 అనుబంధము.)

రః —అయ్యో! ఇట్టి వేదాంతముల నేర్చి, కేళికాగృహమునఁ బంచబాణుని శరములఁ జిక్కి సొక్కుచుండు ధర్మపత్నిని మోసపుచ్చు టేటిన్యాయము ? మన మెట్టిధీరచిత్తులమైనను భగవత్సృష్టికి వ్యతిరేకముగ నడువ శక్తులమగుదుమా ?

గీ. మన్మథాగ్నిని బడి మాడి - మ్రగ్గుచుండఁ
[illegible]ఁదీసి సముద్రమును - జేర్ప కిట్లు



నీతులను దెల్పఁబూనిన - నెగడు టెట్లు
వంచన యొనర్ప నొప్పునో - వనిత నిట్లు.

చం—(తనలో) ఈమెను వేఱొకయాలోచనఁ ద్రిప్పఁజూచెదను. (ప్రకాశముగా) ఓకాంతారత్నమా! చూచితివా సృష్టివైచిత్ర్య మెంతరమణీయంబై యొప్పుచున్నదో. సకలచరాచరంబులకుఁ గర్తయై, యెంతటిబుద్ధిశాలురనైనఁ గనులఁ గప్పి, తన్నుఁ దెలిసికొనకుండ నెల్లవేళల యత్నించు నాభగవానుని చర్యల కెవ్వరు లోఁబడక, తదేకధ్యానంబునఁ గొల్చుచుందురో, వారు మాత్రమే యా సచ్చిదానందస్వరూపుని గాంచఁగల్గుట. వారే యిహపరసుఖంబులవలని ప్రయోజనమును దెలిసికొనఁజాలుట. అంతియేకాని, మోహపాశబద్ధులై యీ మాయా లోకవిలోకనమే శాశ్వతమని తలపోసి, యామూలకారణుని మఱచి వర్తించుచుండినఁ, బుట్టుటకును గిట్టుటకును నలపాలు పడి, యా బురదనీటనే యెల్లవేళలఁ జరించు టెట్టివెఱ్ఱితనము? కావున మన మిరువురము గూడ నాపరమేశ్వరునే యర్చించి, సుఖము లందుదము.

రత్న—ఇట్టి వేదాంతములఁ దిలకింపఁ దగుసమయ మిూ చిఱుత ప్రాయమా ?

(13 అనుబంధము.)

సీ. నవయౌవనంబున - నాతిని గూడియు
స్వర్గసుఖము లందఁ - జనును గాని
ముదమార పత్నియౌ - ముదిత నింపునఁ జేరి
స్వర్గసుఖము లందఁ - జనును గాని
కౌఁగిళ్ళఁ బెనఁగి సత్కాంత నింపునఁగూడి
స్వర్గసుఖము లందఁ - జనును గ

మోముమోమునఁ జేర్చి ముద్దాడి మక్కువ
స్వర్గసుఖము లందఁ జనును గాని
గీ. చనునె యిట్టుల వేదాంత చర్చఁజేయ
వయసునంతను వృధపుచ్చి వనిత నెంతో
కష్టములఁ జొన్పి యూరట కల్గనీక
పాడియే నాథ! యేరీతి బ్రదుకుదాన.

చం.—సీ. ముద్దుమోములటంచు మోహమందుటె కాని
తలఁపరు మాయను దాల్మి కల్గి
సంసారమంచును సతులఁ గూడుటె కాని
తలఁపరు మోసము దాల్మి కల్గి
ముదితల ప్రేమయే మూలమందురు కాని
తలఁప రసత్యమున్ దాల్మి కల్గి
ప్రాణంబు పోయిన బాగందురే కాని
తలఁప రెగ్గును మదిఁ దాల్మి కల్గి
గీ. అరసిచూచిన నిది కల్ల యగును గాని
నిత్యసుఖమానె యిటు లవి నీతు లగుచు
మూఢబుద్ధిచే మానవుల్ ముదితలందుఁ
బ్రేమ నుంచియుఁ జెడుదురు భీతిలేక.

కాన,

చ. అతివరో! శాశ్వతంబులని యాసలఁ జిక్కియు సౌఖ్యనేల? యే
ప్రీతముల సల్పఁబూనినను భావన లెన్నిటఁ దాల్ప నెంచినన్
సంభ్రమ నొందకుండ భువి మాధవుచింతల నుండు టొప్పగున్
పతియును నాథుఁడంచు నఘ సంగమమేటికి పాపహేతువౌ.

(14 అనుబంధము)

[illegible]



త్వమును జూపఁదొడఁగిరే కాని, మీ నిశ్చితాభిప్రాయ మిది యని తలంపఁజాలను. ఎంతకాల మీరీతిఁ బరిహాసమునకుఁ దా పొసంగి కుందఁజేయుట?

గీ. కామశాస్త్రవిముఖుండవై కానరాక
తొలఁగి వర్తించుటగిదిని దోపఁజేయు
టేల? చాలింపుఁ డార్య! నీ వింకనైన
వీడు పరిహాస మోనాథ వెఱపుఁదీర్చి.

చం.—కాంతాశిరోమణీ! నాపల్కు లసత్యములనియుఁ బరిహాసము లనియు నెంచకుము.

రత్న—ప్రాణనాథా! అయిన నిటులఁ ద్రోసిపుచ్చు టేటిన్యాయము?

ఉ. భానునిరాకఁ గోరి మదిఁ బద్మములారిని సౌఖ్యభంగి నా
మానస మెల్ల వేళలను మాన్పడి భ్రాంతిని ప్రాణనాథ! నీ
యాననముం గనంగ నెటు లార్తిని గుందు వచింపఁజాలఁగా
వేనకువేలు చింత లిడి ప్రేమఁ దొరంగి త్యజింపఁజెల్లునే.

చం.—ఇందువదనా!

గీ. భగవదారాధనల్ సల్పి భక్తిమెఱిని
పుణ్యలోకసుఖంబులఁ బొందనగును
కాన, భజియింపు మింక సద్గతి దలంచి
దేవదేవుని భక్తి సంధించి మదిని.

ఈప్రపంచంబునఁగల జీవరాసు లన్నిటిలోను మానవజన్మమే యుత్కృష్టంబైనది. ఉత్తమోత్తమం బగునట్టి మనుజజన్మ నుద్భవించుటయే కడు దుర్లభము. సచ్చిదానందరూపమగు నాపరమాత్మను దెలిసికొనఁ దగు సమయము. అట్టితఱి మోహపాశబద్ధులమై కాలము నీయిహలోక సుఖంబులందే గడపుచుఁ గన్నులమూసి వర్తించుచుండిన దెరువేమి కలదో యాలోచింపుము. అశాశ్వతంబులగు నీతుచ్ఛ

కానఁ జెందక నెన్నితపంబు లాచరించినను నిష్ప్రయోజనము. నిరర్థకము. కామాద్యరిషడ్వర్గంబులకుఁ జోటొసంగి శాశ్వతపదంబుల నందఁజాలని వ్యర్థు లున్నను లేకున్నను నొక్కటియే. మోహ మెంతటి ధీరుల నైన నిమిషమాత్రంబున మోసపుచ్చఁ గలదనుట నిక్కువమే. అట్టిమోహమును విడనాడిననే కాని, ధీరత్వ మొరఁగూడుటకు దావెచ్చుటనుండును?

రత్న—ప్రాణేశ్వరా!

గీ. కామ మోహాదిగుణములఁ । గానకుండ
నొక్క సారిగ మోక్షంబు । నొందు టెట్లు?
చిన్నవయసునఁ బరగక । పెద్దయగుట
కెటు లలవడును తోఁపదు । యోచిచూడ.

ఇదియును గాక,

గీ. పుత్రసంతతియే లేక । పురుషుఁ డెట్లు
పోవ నేరీతి వశమౌను । పుణ్యలోక
సుఖము లందఁగఁ బ్రాణేశ । సుదతుల నిలఁ
గూడకుండంగ సుతు లొడఁ । గూడు టెట్లు ?

ఐహికసుఖంబులకుఁ దొలుతలోనై యుందాకితేరి యద్దానినిపీడి పిదపఁ బరలోకసౌఖ్యములం జవిఁగొన యత్నించుట తగును. కాని, యిట్లొక్కమాఱుగ సోపానములే లేకుండఁగ, సౌధముఁ బ్రవేశింప నెట్లు సాధ్యం బగును? కాన,

ఉ. వఁగారుఁడు క్రూరుఁడై వికల । మానసిగా ననుఁ జేయఁజూచుచున్
భారముమాన్ప కీవిధిని । బాతకమంచును జెప్పు టొప్పునే
కోరికలెల్లఁ దీర్ప మిఁకఁ । గూడును కూడిక లిత్తుర్ మదిన్
ఊరక వాడిమే యిటుల । నూరటఁబుచ్చక వీడు టుర్విపైన్.

(ని[illegible]ంచఁ బోవును.) (15 అనుబంధము.)



చం—(దూరముగఁ జని) ఈ వృథాలాపము లేల? నాపల్కుల నాలింపుము.

ఉ. కామ మదాంధులై యెవరు । కానఁగఁజాలిరొ మోక్షమార్గమున్
నీమములెల్లఁ బోవిడచి । నీచమటంచును నెంచ కెందఱో
భామలఁజేరి వంచనల । పాలగుచుండిరొ సంతసం బిలన్
కామమెయంచు నెంచి యిటు । కాంతను జిక్కుట మోసపోవుటా.

రత్న—(తనలో) అయ్యో! ఎన్నిరీతుల బ్రతిమాలినను బెడచెవిని బెట్టుచుండెనే కాని, యిసుమంతయుఁ గనికర మెంచుటలేదు. ఎవ్వరీతనిమానసముఁ ద్రిప్పి, నాకు నపారమగు జింతలఁ గల్పించిరో కదా! ఎవ్వరో యననేల? నాప్రారబ్ధమే నన్నిటు లిడుమలందఁ జేయుచుండెడంగె. (ప్రకాశముగా) నాథా! ఇదేటి యాగడము? పరిణయ మాడువేళ నీ నీతులన్నియు నేమూల డాగియుండెను? తొలుత మనసార వరించి, చేపట్టి, తుద కీరీతి నడవుల పాలొనర్చుట పాపహేతువు కాకుండునుగాఁబోలును! అయ్యో! సుమశరా! నీకు నిదియే సమయమా? ఈ కుమారునివలెనే యీవును నిర్దయాపరుఁడవై, యబలనగు నన్నిడుమలందఁ జేయఁదగునా?

చం—కాంతా! తొలుతఁ జేపట్టితినని, నన్నేల నిందఁ బుచ్చెదవు? నాకీవేదాంతము మొదటినుండియు మనంబునఁ జిక్కియే యున్నది. అందువలననే, నీవు పెండిలివేళఁ జేతి పూఁగుత్తి ముల్లోకనాథుండగు నాపరమాత్మస్వరూపుండగు భగవానునికే యర్పించి యాతనినే భర్తగఁ జేకొనఁ జాలితివి, ఇఁక దాచనేల? ఇంతటినుండియు, నాదైవమునే ప్రాణనాథునిగ నమ్మి భజించి సుఖము లందుము. మానవమాత్రుఁడనగు

నన్ను గవయ నేలనుంకించెదవు? అట్లుకాకున్న, నీలోకమున నిందాపాత్రురాలవగుటయేగాక, పరలోకమునఁగూడఁ జింతలఁ జిక్కవలసినదాన వగుదువు. కాన, నిక్కమును గుర్తించి వర్తింపుము.

రత్న—గీ. అగ్నిసాక్షిగఁ గొన్నట్టి యతివ నిట్లు
తూలనాడియు న్యాయంబె త్రోసిపుచ్చ
కఠినమాపల్కులాడి చీ కాకుపఱచి
పతియె వీడిన గతియేమి సతికి నింక.

ఎల్లరును దాము బోధించెడు బోధలఁ జిక్కిన, నిఁకఁ బురుషులనియు, వనితలనియు, బిడ్డలనియు సృష్టించు నాభగవానుని యూహాలన్నియు నిరర్థకములేకదా. ఇంతయేల? ఈలోకమే సున్నయగును. ఇఁకనైన నాయందుఁ గృప వహింపుము.

చ. ప్రియమునఁ గౌఁగిలించి నను ప్రేల్చెడిమారుని కాకలార్చి య
ప్రియములఁ బల్కఁ జూడ కిఁక ప్రేమనుబూనుఁ డవశ్యమియ్యెడన్
ప్రియసతిఁగానొకో తలఁచఁ బ్రీతిని గావఁగ నెంచ కక్కటా!
నయమగునే! చరింప నిటు నాథరో! యార్తినిదీర్పు వేగమే.

(అని డాయఁ జనగ చంద్రికాంతుఁడు త్రోసివేయ) హా! భగవానుఁడా! (అని మూర్ఛ మునుంగును.)

చం.—ఆహా! ఇప్పటికికదా నాజనకుని యాజ్ఞానువర్తినై యీపెను మోసగించి కృతార్థుఁడనైతిని. తడయనేల? (నిష్క్రమించును.)

రత్న—(కొంతవడికి మూర్ఛఁదేఱిచూచి నాథునిగానక) నాథా! నాథా! అయ్యో! ఎందుడాగితివి? నన్నిన్నిరీతుల దుఃఖవారిధిని ముంపనే నొనర్చిన యపరాధమేమి? నన్నీ విరహవేదన పాలొనర్చి ప్రాణములఁ దీయుటకంటె నీచేతుల నొక్కమాఱుగ వధించి పుణ్యముఁ గట్టుకొనరాదా! ఇట్టి కఠినహృదయుఁడ వగుటకుఁ



గతంబేమి? ఎందుఁబోయితివి? ఎచ్చటనో దాగియుండి నన్ను వెతలఁబెట్టుట తగునా? (అని నలుగడలఁ బరికించి కానక)

సీ. పరిహాసమున కిట్లు పల్కుచుంటి రటంచు
భావించియుంటి నే భవ్యచరిత
మనము నాపయి నింత దయకఁ జేరరటంచు
దలఁచియుంటిని కాదె ధైర్యమంది
నామది నీబోధ నాటెనో కాక వి
భ్రాంతనో మొఱఁగఁ గో రంగఁ దగునె
యబలను దృఢ చిత్తనైనను గాను నీ
ధ్యానమే ముక్తిగాఁ దలఁచినాను

గీ. కల్లలై చనె నన్నియు కడకు సత్య
మదియె యనునట్లు సాహస మంది యిటులఁ
బోవఁ బాడియె ప్రాణేశ భూరిసుఖము
లందఁజూచితి వృథయయ్యె నకట యిందు.

కటకటా!

గీ. నాథునందఁ జేరియు నే ననాథనైతి
తొల్లి నేఁ జేసియున్నట్టి దోసమేమొ?
కాంతుఁడే క్రూరబుద్ధియై కాంతఁద్రోయఁ
దెరువుకలదొక్కొ భువి నెట్టి ధీరలకును.

ఇప్పుడెవ్వరిదాపునఁ జేరి శరణు వేఁడుదాన? నా యీయార్తినిదీర్చి ప్రోచువా రెవ్వరు?

(16) అనుబంధము

(పెట్టెను దిలకించి) నామనోహరుఁ డిందే యిందా దాగియుండెను. లేకున్న దీని నిచ్చోట వీడిపోవునా? వీరి యిష్టదైవస్వరూపమేమియో చూచెదముగాక. (అని పెట్టెఁ దెఱచి [illegible]

ఆశ్చర్య నిమగ్నయై) ఆహా ! ఇదియేమి ? ఈ పసిబిడ్డ డింకుండఁ గతం బేమియో? పురిటింటిపాపవలెఁ గన్పట్టుచున్నను,

గీ. కలువరేకులఁ బోలెడు । కన్ను లహహ!
దేవదేవుని పగిదిని । దివ్యకాంతిఁ
బ్రజ్వరిల్లఁగఁ జొచ్చెను । బాలుఁడయ్యు
మోహవారిధిఁ జూపుచు । ముంపఁదొడఁగె.

ఏమి యీతనిదివ్యకాంతి! (అని యెత్తిముద్దుగొని) ఈతనిమెడ నేదియో పత్రిక కట్టబడియున్నది. ఏమైయుండునో?(అని తీసి చదివి) హా!దైవమా! (అని మూర్ఛిల్లి లేచి) సర్వేశ్వరా! ఈపురిటివాపను నాకుఁ బతిగాఁ బ్రసాదించితివా?

చ. పతియని తోపఁ జేయు పసి । పాపను జేర్చితె దోసమేమియో
సతినిటుఁ గూర్పకుండఁగను । సాధ్యముకాదొకో యాయువీయఁగ
వెతలను జిక్కఁజేయు నెటు । వీశగనోపుదు భారమయ్యెడిన్
యితనికి భార్యనై సతత మే । విధి సేయుదుఁ గాపురం బహా.

దీనదయాపరుఁడవని బిరుదువహించి, యీ వానర్చు సాహసకృత్యంబు లివియా? నా కేఁగతిఁ గల్పించితివి? నాయావనంబంతయు బురదపోసిన పన్నీటివిధాన నిష్ఫలంబగుదు గదా. నన్నేల జన్మింపఁజేసితివి? ఈ పాపదవాగ్నిం బడి మ్రగ్గుట యెంతకాలము?

ఏమైన నాపరమేశ్వరునిదే భారము. ఏనింక నిచ్చోటఁ దడసి యీరీతి విలపించుచుండిన, నాజనకుం డీవార్త నెఱింగి, నామామగారి కెట్టియాపద లోనఁగూర్చునో ? ఈబిడ్డయు దైవప్రసాదనమేయనియు, నిది యాసర్వేశ్వరుని యానతియేయనియుఁ గదా యిందు లిఖింపఁ బడెను. అందువలన శక్తివంచనలేక, యీతనిఁ బెంచిపెద్దవానిగఁ జేయఁ గొంతకాలమునకైన నాకోర్కె నెఱవేరకుండునా ?

( హా! ఈపసిపాపడు పెరిగి పెద్దయై నన్నుసుఖము లందఁ



జేయునా? ఇంకెక్కడియాసలు ? ఇంతదనుక నాకు వేదాంతమును బోధఁ జేసి నాతఁ డెవ్వఁడైయుండునో ?

ఆహా ! నాకెన్ని యిడుమలు ప్రాప్తించినను, నెట్టిదుఃఖము చేకూరినను, నామహానుభావుని ధైర్యసాహసముల కొంతయు సంత సము కల్గుచున్నయది. ఒకవేళ నామూర్ఖత్వంబునకుఁ దోడుగ నాతఁ డును మనసుచెడి వర్తించిన నెట్టి యకార్యములు సంభవించి యుండ వలసినదో !

గీ. ఎట్టిధీరత్వ మెదఁ దాల్చి । యెన్నరాని
పుణ్యకార్యంబునను దాను । బోయె నహహ !
నాదు మూర్ఖతఁ దలఁచిన । నాకె సిగ్గు
కలుగఁదొడఁగెను ధాత్రాజ్ఞఁ । దలఁప వశమె.

(మంత్రిసుతు నుద్దేశించి) మహాత్మా! నాతప్పుల మన్నింపుము.

సీ. భర్తవంచును నిన్నుఁ । బరిపరివిధముల
నిందఁబుచ్చిన నది । నీచమనక
కఠినుఁడవంచును । గారవంబునఁ గడు
నిందఁబుచ్చిన నది । నీచమనక
వేదాంతవాక్యముల్ । వీడవటంచును
నిందఁబుచ్చిన నది । నీచమనక
చేపట్టుటేలని । చెనటినై నినుఁజూచి
నిందఁ బుచ్చిన నది । నీచమనక

గీ. ధైర్యమూనియుఁ గినుకను । దాల్పకెదను
నీతులను బోధచేసియు । నెగడియుంటి
వట్టి నీదుస్మరణయె నా । పాలి కిఁకను
దైవసాహాయ్యమట్టులఁ । దరలుఁగాత.

(20) అనుబంధము. (నిష్క్రమించును.)

### అరణ్యసీమ.

[ప్రవేశము:—బాలకునితో రత్నమాల]

### (21) అనుబాధము

రత్న—అయ్యో! ఘోరమృగనివాసంబై, నిబిడీకృతమగు నీ నిర్జనారణ్యంబున నేరీతి సంచరించుదాన? హా! దైవమా!

సీ. నవయౌవనంబున - నాథుఁడంచును మాని
బాలునితోఁ గూడి - బ్రతుకవలసె
సౌధసీమలయందు - సంచరించుట మాని
ఘోరావనిని జేరి - కుందవలసె
చెలిమి మక్కువఁగూర్చు - చెలుల నెల్లర వీడి
ఘాతుకమృగములఁ - గలియవలసె
మురిపెంపుచిల్కల - ముద్దుపల్కుల మాని
భీకరారవముల - వినఁగవలసె

గీ. కటకటా! యిట్టు లెన్నాళ్ళు - కాననమున
నొంటిమై సంచరింపంగ - నోర్చుదాన
దైవమే యిడుమలఁ గూర్పఁ - దలఁప నిటులఁ
బ్రోచువా రెవ్వ రింక నిరపుడసు నన్ను.

ఈ బాలుఁ డాఁకటిచే నేడ్వదొడఁగె. ఏరీతి నోదార్చుదాన.

సీ. పురిటింటి పసికూన - పోరు వెట్టఁదొడఁగె
క్షీరము లేరీతిఁ - జేర్చుదాన
పేర్మి బాలకులను - బెంచెడుమార్గంబు
విననైతి నేరీతిఁ - బెంచుదాన
ఆఁకలిదప్పుల - నడలుచు నెటు వీని
జీవంబు నిలువంగఁ - జేయుదాన



బాల్యమంతయు వీడి - ప్రాణేశ్వరీ యని
పిల్చువానిగ నెట్లు - పెంచుదాన

గీ. నిర్జనారణ్య మిది దీని - నేర్పునీఱి
దాటి చరియించు టెట్టులో - ధాతయాజ్ఞ
మీఱఁగా శక్యమౌనె భూ - మీస్థలమున
బ్రదుకు టెట్టులు? పతిఁ బెంచి - భారమనక.

(ఊరడించుచుఁ గొంతదూరముపోయి కఱకుటాలచేఁ గాళ్ళు రక్తమయముకాఁగా) అక్కటా! ఈబాధల కెట్లు సహించుదాన. ఈరీతి నెంతకాలము యిడుమలం గుందుచుండవలెనో? ఓసర్వేశ్వరా! దీనదయాపరా! భక్తపరాధీనా! ఏను నీయెడ నెట్టి యపరాధము లాచరించియుంటిని?

గీ. బాలుఁడేమైన నీతనిఁ - బరమభక్తిఁ
గొల్చుచును సేవఁజేయుచుఁ - గోర్కెతీర
బయలువెడలితి నీరీతి - భారమనక
కావు మీతనిఁ గరుణతోఁ - గమలనయన.

అయ్యో! ఆఁకటిబాధ కోర్వఁజాలక విలపించు నీతని నేరీతి నూరటఁబుచ్చుదాన? క్షుద్బాధచేఁ గన్నులు కూడ మూతపడినవి. ఓపంచభూతములారా! నే నీతని యార్తిని జూడఁజాలకున్నదాన. మీరలైన నా ప్రాణముల హరించి పుణ్యముఁ గట్టుకొనుఁడు. ఈయదృష్టహీనురాలి యెడ నెవ్వరికిని గరుణరాకున్నదే. (బాలుని గాంచుచు) ప్రాణేశ్వరా! నాయట్టి యధమురాలి కతంబున నీజననిబాసి యీవనమున నాఁకటిచేఁ గుందవలసినవాఁడ వైతివా? అయ్యో! నీమో మెంత వాడియున్నది?

గీ. పెంచి పెద్దవానిగఁజేయఁ - బ్రేమఁ జూపి
సౌఖ్యములఁ గూర్తువంచు నే - సాహసమునఁ

దోషొక్కనియు నిందఁజేరితిఁ । దోడు నీవె
యంచు నెంచితిఁ జూడవే । యాదరమున.

(తెరలో వ్యాఘ్రరవము) ఈక్రూరమృగభీకరారవంబుల నెంతయు భీతికలుగుచున్నయది. అయిన నేమిసేయుదాన?

గీ. సకలజీవుల కీయిల । శరణ మెవఁడొ
మూఁడులోకంబులకుఁగూడ । మూల మెవఁడొ
ఆదిమధ్యాంతరహితుఁడై । యలరు నెవఁడొ
యాతఁడే నేఁడు నాకు । సదాశ్రయంబు.

(ఒకచెట్టునీడను జేరి) కొంతకాల మీచెట్టునీడను విశ్రమించెద. (ఆపె ముందర నొకయంగుళీయముపడ ఆశ్చర్యముతో) ఏమిది? ఇది యిందుల కెటువచ్చెను? (నలువంకలఁజూచి) ఈచుట్టుప్రక్కల నెక్కడను మనుష్యసంచారమే లేదే. ఎంతయు వింతగానున్నది.

[అశ్వనీదేవతలు ప్రవేశము.]

అశ్వ—ఓరత్నమాలా! భగవదనుగ్రహమున నీ కా యంగుళీయ మొదవె. దానిని నీపతినోటనుంచిన క్షుత్పిపాసలు నశించును. దైవసంకల్పముననే యాతఁడు నీకు భర్తగ లభించెను. కొలఁది కాలముననే యాతనిఁగూడి సుఖింపఁగలవు. చింతఁదక్కి యుండుము.

(22) అనుబంధము.

(నిష్క్రమించును.)

రత్న—మహాప్రసాదము. ఏమినాపుణ్యము. కొంతకాల మీవనముననే గడపెదను.

(నిష్క్రమించును.)

(తెర పడును.)



శ్రీరస్తు.

# చంద్రకాంతనాటకము.



## పంచమాంకము.



చెఱసాల.

[ప్రవేశము:—చంద్రహాసుఁడు.]

(23 అనుబంధము)

చం—ఓ యీశ్వరా! ఎల్లవేళల నెల్లజనుల మోసగించుటయే నీకుఁ గర్తవ్యకార్యమా? కాకున్న నిదేటి యాగడము?

చ. ముదమున పుత్రిలన్ బడయఁ । బూజ లొనర్చియు భక్తిఁగొల్వగా
వదనమెచూపి మెచ్చి యెదఁ । బాప వె చింతల యీప్సితార్థమున్
కదపడి తీర్చెదంచు బహుభంగులఁ బల్కియుఁ బుత్రినిచ్చి యా
పదలనుగూర్ప నేటి కిటు । భక్తికి మెచ్చుట భంగపుచ్చుటా.

అహో! నే నొనర్చిన పాపదవానలమునఁబడి మ్రగ్గుచు నాదేవదేవుని నిందింపనేల? ఈ కారాగారవాసమే యిఁక నాకుఁ బ్రాప్తి కాఁబోలును. తొల్లి యెవ్వరికిఁ గష్టములఁగూర్చి సంతసించితినో, యాపాతకమే యీనాఁడు కట్టికుడుపుచున్నయది. లేకున్న నింతదనుక, సింహాసనారూఢుండనై, స్వేచ్ఛతో రాజ్యపాలనం బొనర్చు నాకీ కారాగారవాస మేలదాపరించును.

గీ. పరుల హింసింప నెన్నఁడుఁ బాపమంచుఁ
బ్రజల బిడ్డలభాతి గా పాడుచుంటి
ప్రజ లన్నియు నీరీతి బుగ్గియయ్యెఁ
గారణం బేమొకో నాదు కష్టములకు.

రాజాధిరాజనై వెలుఁగందుచుండు నే నీనాఁ డొక రాజుచే నోడింపఁబడి చెఱసాలను గనివిని యెఱుంగని కష్టములకు లోనుగావలసి వచ్చెనుగదా. ఇదంతయుఁ దర్కించిచూడ నా పతివ్రతాశిరోమణి నన్యాయముగ నిడుమలపాలొనర్చుటయే యిందులకు హేతుభూతమై యుండ నోపు. నా మంత్రులాది పరివార మెచ్చట దాగియుండిరో. నాధర్మపత్ని నా యెడఁబాటుచే నెంతగఁ గుందుచుండెనో. అక్కటా! వీటి నన్నిటిని దలపోయ హృదయము వ్రక్కలగుచున్నయది. (భార్య నుద్దేశించి) ఓవనితారత్నమా! ఈ పాతకుని జేపట్టినందుల కెంతగ ఖిన్నతను బొగులుచుంటివో గదా. ఒక్కక్షణకాలమైన వీడి చరింప నిష్టమొందకుండెడి నీవు నేఁడు నన్నుఁ బాయుటచేఁ బ్రాణములనే వీడియుంటివేమోకదా. కటకటా! నా యీ యార్తిని దీర్చి రక్షించువారెవ్వరు?

అకారణంబుగఁ దన్నిడుమలఁగుడుపఁ జూచినందుల కారత్నమాల కినుకఁబూని, యాబాలకు నెట్టనైన విడచి దేశాంతర్గతయయ్యెనేమో? అట్లేయొనర్ప నుద్దేశించినఁ దన పుట్టినింటనే యుండి యాచరించిన నడ్డుసేయువారెవ్వరు? ఆనాఁడు శంకరుఁడు పండ్రెండువత్సరముల బాలికను పరిణయమాచరించినఁ జిరకాలజీవి యగునని వర మిచ్చియుండ వేఱురీతి నెట్లగును. నామనంబున జనించిన కలఁతచే నిట్లు తడఁబడుచుంటినే కాని, యాపతివ్రతాశిరోమణి, పతిని వీడి చరించుననుట కల్ల. దైవకటాక్షంబున నాప్రియపుత్రుఁడు దినదినాభివృద్ధి నొందుచు వన్నెకెక్కిన నే నీపుడమిని వీడిపోయినను నిర్విచారమే కదా. ఓ మంత్రిపుంగవులారా! నన్నీసింహకేతుఁడు గొంపోయి, బంధీకృతుని



జేసెనని యెంతగవిలపించినను బ్రయోజనము లేదు.

గీ. ధరణిపతిఁ గొనిపోవఁగఁ దలఁచి ధీర
పౌరుషంబును మదిఁ దాల్చి భారమనక
దాడివెడలియు నీభూపుఁ డో డి యరుగ
సంగరంబునఁ జేరఁగ జనుఁడు మీరు.

(ఆలోచన నభినయించి) ఇంతయేల? ఇట నున్న కావలిభటులు నిద్రాసక్తులై యొడలుమఱచియున్నవారలు. కాలానుసారముగ వర్తించుటయే ధర్మము. రాజునకు సౌఖ్యమే కూడినను, గష్టములే సంభవించినను సేవకులమూలముననే కదా. ఇఁకఁ గాలయాపన మేల? నాపనిని నెఱవేర్చుకొనెదను.

(అని యొకద్వారమునుండి మెల్లగ నావలికిఁ జనును.)

ప్రదేశము:—అరణ్యసీమ.

[ప్రవేశము:—వనబాలకులతో చంద్రకాంతుఁడు.]

(24 అనుబంధము)

చం—మిత్రులారా! మృగములఁ గాంచినంతనే యిట్లు భీతిలి పాఱెదరేల? రండు. రండు. అయ్యవి మనలఁ జూచి పరుగిడవలెనే కాని, మనము వెనుదిరుగుట పాడికాదు.

వనబా—బాబో! మేము రాము. ఎప్పుడైన నీ విట్టులే సెప్తావు. నీకు భీతి లేదు.

చం—ఓరీ! బాలకులారా! ఏ నాసింగంబు నోడించి దానిపై నెక్కి సవారిగీసెదను. మీ రిందుండి యరయుచుండుడు.

వనబా—వలదు. బాబూ! వలదు. నీతల్లి మమ్ముల దండించును.

చం—మాజననితోఁ జెప్పవలదు. భయము లేదు.

వనబా—మేముపోయి మీతల్లిని గొనివచ్చెదము.

చం—(కన్ను లెఱ్ఱఁజేసి) అట్లైన దండించెదను.

వనబా—(భయముతో) వద్దు. వద్దు చెప్పను. చెప్పను. ఇక్కడనే యుండి యరయుచుందును. బాబూ! జాగ్రత్త.

చం—ఇప్పుడే తిరిగి వచ్చెదను. (అని నిష్క్రమించును.)

వనబా—అబ్బో! అబ్బో! ఇదేటి సాహసము! సింగము పిల్లివలెనే లొంగిపోయినది. ఎంతవాఁడవయ్యా బాబూ! ఏమో అనుకున్నాను. చెప్పినట్లు సవారీయిచున్నావు. (పరికించి చూచుచున్న ట్లభినయించి) మొగ్గలే. వద్దు. వద్దు. అయ్యో! క్రిందఁబడిపోయినాడు. దెబ్బ తగిలినదేమో. లేదు. లేదు. మరల లేచి సింహమును జావమోదుచున్నాడు. ఏమిసాహసము! చంపుచున్నాడు కాఁబోలును. క్రిందపడినది. చచ్చినదా యేమి?

[తెరలో]

ఓరీ! ఇది చచ్చినది చూచితివా?

వనబా—అక్కడనుండి రమ్ము బాబూ!

[ప్రవేశము:—చంద్రకాంతుఁడు]

వనబా—పడినప్పుడు దెబ్బ తగులలేదు కదా.

చం—లేదు. లేదు. మా అమ్మతో చెప్పకూడదు సుమా.

వనబా—చెప్పకుంటే యెప్పటికప్పుడే యిట్లు పరుగిడుచుండిన మోసమగును.

చం—ఇంకెన్నఁడును బోనులే.

వనబా—(తెరలోనికిఁ జూచి) అరుగో! మీయమ్మగారిటు వచ్చుచున్నారు.

చం—చెప్పకు సుమా.

వనబా—అడిగినఁ జెప్పుదును.

చం—పండ్లకై వచ్చితినని బొంకెదను.



[ప్రవేశము:—రత్నమాల.]

రత్న—నాభాగ్య మేమనఁదగును.

గీ. దినదినము వర్ధమానుఁడై ౹ తేజరిల్లు
కాంతు నరయఁగ మితిలేని ౹ సంతసంబు
కూడుచుండెను భాగ్యంబు ౹ కూడుకొనియెఁ
బూర్వజన్మ మొనర్చిన ౹ పుణ్యమేమొ.

ఈతని రూపవిలాసంబులు నిజముగ నామన్మథునిగూడ ధిక్కరించుచున్నవి. మోహనాంగుఁడును, సచ్చరిత్రుఁడు నైన నాథుఁడు లభించుట కంటె, వనిత కీయిలఁ గావలయునదేమి? ఎన్నఁడైన వీనిఁగూడి సుఖించుభాగ్య మబ్బునాయని తొలుత నెంతయు భీతినొందసాగితిని. అవన్నియు నేటికి రూపుమాసి, యాశాంకురములు నాటఁదొడఁగెను. (ప్రకాశముగా) ఓయీ! చంద్రకాంతా! నన్ను వీడి, యీరీతిఁ గడుదూర మొంటిగ రాఁజెల్లునా?

చం—భయమేమి? ఫలములఁ గొన నేతెంచితిని.

రత్న—(దగ్గఱకుఁ జేర్చుకొని ముద్దిడి) క్రూరమృగనివాసమగు నీయరణ్యమున భీతిలేక సంచరింప నింకను బాలుఁడవు కాదా. పండ్లు కావలసిన నేను దెచ్చి యీయకుందునా? పంచప్రాణములు నీయందే నిల్పి, నాసర్వమును నీవే యని యెంచుచుండ, నీకేదైన నపాయము వాటిల్లిన బ్రదుకఁగలనా? ఇప్పుడు వచ్చిన వచ్చియుంటివి కాని, యింకెన్నఁడు నాతోఁ జెప్పక రానని శపథ మొనర్పుము.

చం—అబలలన నిందులకే వనితలకుఁ బేరువచ్చియుండెను గాఁబోలును.

గీ. వయసు వచ్చినగూడను ౹ వనములందుఁ
దిరుగ భయమేల నమ్మరో ౹ దిగులువడగ

నేటి కిట్టులఁ బరిమార్తుఁ  బాటిసేయ
కుండ జంతువు లన్నిటిఁ  గోర్కెతీర.

(25 అనుబంధము)

రత్న—రాకుమారా! ఇట్టిసాహసము వలదు. నీకు వలయువాటిని నేనే తెచ్చియిచ్చెదను.

చం—పురుషుఁడనై జన్మించి, యబలలకు వలయు పదార్థములఁ గొని వచ్చుటకుమాఱు, వారిచేఁ దెప్పించుకొనవలెనా? ఇదియుఁ గాక, భగవానుఁడు కృపామయుఁడై యిట్టివనముల నేర్పాటుఁ గావించి ఫలములాది యాహారముల ననుగ్రహించియుండ, వాటిఁ గొనుట కొకరిసెలవు కావలయునా?

రత్న—ఆహా! నామనోహరుని ధైర్యసాహసము లేమనవచ్చును. నవరస భరితంబులగు నీపలుకు లెంతయు నానందవార్ధిని ముంపుచున్నవి. ఇదియే కదా, నాప్రియునితో సరసోక్తులనాడి రంజిపఁ జేసి, రంజింపఁబడుటకుఁ దొలిసారి. (ప్రకాశముగా) చంద్రికాంతా! చిఱుతప్రాయమునందే యిట్టిస్వతంత్రమును జెందఁ దగునా?

చం—అమ్మా! పుట్టించినలోడనే భగవానుఁడు స్వాతంత్ర్యత నొసంగ నిట్లు పలికెద వేల?

రత్న—రాకుమారా! న న్నింతటినుండి యమ్మా యని పిలువకుము.

చం—ఏమనవలయు?

రత్న—పేరునఁ బిలువుము

చం—ఏమని పిలువవలెనో చెప్పుము.

రత్న—రత్నమాలికా యని.

చం—నే నంతమాట ననలేను.

రత్న—పోనిమ్ము. ప్రియా అని పిలువుము.



చం—అన నర్థమేమి?

రత్న—పిదపఁ దెల్పెదను. ఏను చెప్పినట్లు పిల్వుము.

చం—ప్రియా! నా కాఁకలియగుచున్నది. పండ్ల నేమైన నిమ్ము.

రత్న—నేఁటికి గదా నానోములు ఫలించి, నేను కృతార్థనైతిని. నా నాథునిచేఁ బ్రియా యనిపించుకొనఁదగు భాగ్య మబ్బెను. ఎంతయు ధన్యురాల నైతిని.

గీ. మనమలర సరసోక్తుల  మగఁడు పలుక
వినెడుభాగ్యంబు చేకురె  వెలఁది కిఁకను
వలయునది యేది యెన్నఁగ  వసుధ నాదు
నోము లన్నియు ఫలియించె  సామమూన.

(దగ్గఱకుఁ దీసికొని ఆతురతతో) ఈ దెబ్బలేమి? ఏవృక్షమునుండియైనఁ గ్రిందపడితివా?

చం—(భయముతో) లేదు. లేదు.

రత్న—(వనబాలకుని గాంచి) ఓరీ! వీని కీదెబ్బలేమి?

వనబా—సింగంబుపై సవారిచేసి క్రిందపడెను.

రత్న—(క్రోధమూనిన ట్లభినయించి) చంద్రికాంతా! నీయిష్టమువచ్చునట్లు వర్తింపుము. ఇంతటినుండి నాతోఁ బలుకవలదు. నాదఱిఁ జేరకుము.

చం—(దగ్గరగఁ జేరి) ప్రియా! కోప మూనకుము. ఇంకెన్నఁ డిట్లొనర్పను. ఈమాఱు క్షమించుము. నీవు పలుకకున్నఁ బ్రాణములతో నిలువనోపుదునా?

గీ. కలువరేకులఁ బోలెడు  కన్ను లకట!
క్రోధభావంబుఁ జూపఁగఁ  గూడ దిఁకను
నోర్చుకొట్టుల నీయిల  నూరడిల్లఁ
జేయు భారంబు నీయదే  చేరు మింక.

రత్న—(సంతసముతో) అయిననిఁక నాయాజ్ఞలేనిదే యెక్కడకును నొం టరిగఁ బోకుందువు కదా!.

చం—తప్పక యట్లే చేసెదను. ప్రియా! నేఁ గోరిన పండ్లేవి?

రత్న—ఈనాటి కీఫలములఁగొని యూరటనొందుము. రేపటిదినమునఁ దప్పక నీవు కోరినవాటిఁ దెచ్చియిచ్చెదను.

చం—(కన్నుల నులిమికొనుచు దూరముగఁ బోవుచు) నా కిప్పుడే కావలయును.

రత్న—చంద్రికాంతా! ఇట్లు పట్టినపట్టును వీడకున్న నెట్లు?

గీ. వలయువాటిని గొనివచ్చి ♦ వరుస నీయఁ
జాలుదాననే యీవిధి ♦ వీలుపడని
కోర్కెలను గోరి చరియింపఁ ♦ గోపమూన
తగునె? సాధ్యమసాధ్యముఁ ♦ దలపవలదె.

ఆ లేడితో నాడుకొనరాదా?

చం—ఊఁ! వలను. సింగపుఁ బిల్ల నొకదాని నాటలాడుకొననిమ్ము.

(26) అనుబంధము.

గీ. హర్షమొసఁగఁగఁ దెమ్మొక ♦ హరిని బట్టి
యాటలాడుచుఁ గడపెద ♦ ననవరతము
అదియు దుస్సాధ్యమేయైన ♦ నానతిమ్ము
నేనె పట్టియుఁ దెచ్చెదఁ ♦ బూని ముదము.

రత్న—ఓహో! ముదిరిపోవుచున్నదే. ఎప్పుడెట్టికీడు సంభవించునో, బెదరించెదఁ గాక. రాజపుత్రుఁడగుటచే నైజగుణము పోవునా? (ప్రకాశముగా) రాకుమారా! రానురాను కోరరాని కోరిక లతిశయించుచున్నవే. నే నీయఁ జాలకున్న నీవే పట్టి తెచ్చెదవుకా. చాలుఁ జాలు. ఇట్టికార్యము లాచరింపఁ గడంగిన, గీడుమూడును సుమా.



చం—ప్రియా! ఇంతగ భయమందెద వేల?

గీ. అస్త్రశస్త్రము లొసఁగుము ♦ యురసి వనిసి
ఘోరజంతువు లన్నిటి ♦ రూపుమాపి
బాధ మాన్పెద నిటనున్న ♦ ప్రజల కెల్ల
వేటసలుపంగ నెంతయు ♦ వేడ్కకాదె.

వనిత లిట్లే భయపడుచుందురు. కాని, పురుషులకు భీతిఁ గొలుపఁ బాడియగునా?

రత్న—శృంగారరసభరితమగు నామనోనాయకుని వాక్కు లెంతయు నానందసాగరమున ముంచుచున్నవి కదా. (ప్రకాశముగా) రాకుమారా! నాకే ధైర్యమును గొల్పుచుంటివా?

చం—ప్రియా! మన కీయరణ్యవాస మేలకల్గెను? ఎంతకాల మిందు వసింపవలెను?

రత్న—కొంతోక కతంబున నీవనవాసక్లేశ మనుభవింప సమకట్టవలసి వచ్చెను. అది పిదపఁ దెల్పెదను. మన మిపు డీచెంతనున్న నేదైన నొకపురి కేగుదము. అందు నీవు విద్య నభ్యసింప వచ్చును.

చం—ప్రియా! నాకును విద్యనేర్వ మిక్కుటంబగు కోర్కె కలిగె. తప్పక యట్లే చేయుదము.

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

(తెర పడును.)





శ్రీరస్తు.

# చంద్రికాంత నాటకము

## షష్ఠాంకము.

శోణపురివీధి.

[ప్రవేశము:—బడిపంతులు.]

బడి—అబ్బా! ననుఁబోలు కష్టజీవి యీలోకంబున నెవ్వఁడు నుండఁడు. నడుము వంగి, కాళ్ళు వంగి, శరీరము ముడతలుపడి, మాటాడ నోపిక లేకపోయినను, నా కీయిడుములు తప్పవుగదా. హా! దైవమా! ఇంకను నెంతకాల మీపాట్లు పడవలెను? 'పాపి చిరాయు' వనునట్లు నే నేదియో మహాపాతక మాచరించి, యీరీతి దుఃఖ మనుభవించుచుంటిని. ఈ ముసలితనముననే, దరిద్రదేవత కూడ నన్నావహించి పీల్చి వేయుచున్నది.

సీ. కనుఁ గానఁ జాలక ఽ కలధనమంతయు
విటకత్తెలకు నిచ్చి ఽ వేసినాఁడ
మానాభిమానముల్ ఽ మఱచి జూదమటంచు
నవనీతలులఁ దెగ ఽ నమ్మినాఁడ
పడఁతిమాటలఁ ద్రోసి ఽ బంగరు నగలెల్లఁ
ద్రాగుఁబోతుల కిచ్చి ఽ తరలినాఁడ



మేడమిద్దెల నమ్మి ఽ మిట్టిపడుచు నెంతో
సారాయిఁ ద్రావుచుఁ ఽ జనినవాఁడ

గీ. కడకు నిఱుపేదతనమునఁ ఽ గదలలేని
వృద్ధుఁ డను నయ్యు నీరీతి ఽ నుదరపోష
ణార్థ మెన్నియొ యిడుముల ఽ వ్యర్థపుచ్చి
కాలమును గడుపవలసెఁ ఽ గర్మమనుచు.

కడుప నశక్యమగు నీదారిద్ర్యమునకే సహింపఁ జాలకుండఁ బైగా మృత్యుదేవతయో యనఁదగు, నా రెండవభార్య దాపరించి, కాయమున మిగిలియున్న యెముకలనుగూడఁ గొఱికి తినివేయుచున్నది. పండ్లన్నియు నూడిపోయి నోటఁ జొంగలు కారుచున్న నాకును, నాబోటి ముదుసలికి బిల్లనీయుసాహించిన యా వెధవలకును, నాకును వారికిని సమాధానముఁ గూర్చిన మధ్యవెధవలకును గూడ బుద్ధి లేకపోయెను. అయ్యయ్యో! ఇంటిదగ్గర నున్నంతకాలము చీపురుకట్ల దెబ్బలే. ఆ బాధను బడలేక యీవలకు వచ్చితినా, యీ బడిపిల్లల బాధ. ఇంతకన్న నీప్రాణములే మేను వాసిపోయిన నెంతయో శ్రేయోదాయకముగ నుండును. నన్నుఁ జూడ నామృత్యుదేవతకుఁ గూడ భీతి కలుగుచున్నది కాఁబోలును. అరుగో! కోతిమూకలవలెఁ దిగుచున్నారు. ఈపదవిని వీడితినో యిఁకఁ బొట్టకూటికి చెంబుఁ జేతఁ గొనవలసిన దే.

[బడిపిల్లలు ప్రవేశింతురు.]

పం—ఒరే కామయ్యా! నీపాఠము వచ్చినదిరా.

కా—రాలేదండీ పంతులుగారూ! రాత్రి భాగవతము చూచినానండీ. చదవలేదండీ.

పంతు—తక్కినవాళ్లో.

పి—నాకు కొద్దిగా వచ్చిందండీ. మఱచిపోయినాను.

పం—మీరు చెప్తే వినరు. కొడితే ఏడుస్తారు. చదువు రాకపోతే అడుక్కుతింటారంటాని.

పి—అదేమిటండో. అందఱును మీవలెనే అడుక్కుతినవలెనా?

పం—ఎదిరిస్తున్నావురా వెధవా! పెద్దవాఁడను. గురువును. అంత మాత్రపుమాట లనకూడదా?

గీ. విద్య గల్గిన పురుషుండు వివిధగతులఁ
బూజితుం డౌను నిక్క మీ పుడమియందు
పరులు ధనమును హరియింపఁ బాల్పడుదురు
కాని విద్యను దొంగిలఁ గాఁ దరంబె.

కాన, నన్ని సంపదలకన్న విద్యాధనమే గొప్పది.

(27) అనుబంధము.

[ప్రవేశము:—చంద్రికాంతునితో రత్నమాలిక.]

రత్న—ఆర్యా! నమస్కారము.

పం—దీర్ఘసుమంగళీ భవ. అమ్మా! నీవెవ్వతెవు?

రత్న—అయ్యా! ఏకాకి అనాథను, రాజపుత్రికను. కొండొకకాలంబున నీరీతి నీబాలునిగొని దేశద్రిమ్మరినైతిని. దయయుంచి యీబాలునికి విద్యాదాన మొనర్పఁ బ్రార్థించుచున్నాను.

(రాజకుమారుఁడు, మంత్రికుమారుఁడు మోహాంధులై యామెను తదేకదృష్టితోఁ జూచుచుందురు.)

పం—అమ్మా! ఈమాత్రమున కింతగఁ బ్రార్థింపవలెనా? అట్లే చెప్పెదను. మీరు మాయింటనే బసనేర్పఱుచుకొనవచ్చును.

రత్న—మహాప్రసాదము.

పం—కామయ్యా! నీ వీమెను గొంపోయి, మాయింటిని జూపుము.

కా—చిత్తము (రత్నమాలికను దీసికొని యరుగును.)

రాజ—(మంత్రికుమారునితో నేకాంతముగ) మిత్రమా!



యనాథయట. సౌందర్యమున నలరారుచున్నది. మన మెటులైన—

మం—రాజు తలఁచిన దెబ్బలకుఁ గొదవా? మనలదాఁటి యెటకేగును.

రాజ—ఈబాలుని ముందుగఁ దుదముట్టింపవలెను.

మం—ఈదినమున పంతులుగారిని సెలవడిగి, వనవిహారమునకు యాతనిఁ గొనిపోయి, వధించివత్తము.

రాజ—మంచియుపాయమే తెల్పితివి. పంతులుగారూ! ఈదినమున వేటకుఁ బోవ బుద్ధిపొడమినది. సెలవొసంగుఁడు.

పం—మంచిది పోయిరండు.

రాజ—(చంద్రికాంతునితో) నీవుకూడ సెలవడుగుము.

చం—గురువర్యా! నేనును వీరితోఁ బోయివచ్చెదను.

పం—బాలుఁడవు. నీవు పోవలదు.

చం—నాకు భయము లేదండీ.

పం—అయిన పొమ్ము.

(అని నిష్క్రమింతురు.)

(తెర పడును.)



అరణ్యసీమ.

[ప్రవేశము:—చంద్రికాంతుఁడు, రాజకుమారుఁడు, మంత్రికుమారుఁడు.]

(28) అనుబంధము.

చం—మిత్రులారా! కడుదూర మఱుదెంచితిమి. నల్దిశలఁ జీకట్లు క్రమ్మనారంభించెను. నాజనని నన్నుఁగానక యెంతయో విలపించుచుండును. కాన నిఁక తిరిగిపోవుదమా?

రాజ—(జనాంతికముగా మంత్రిపుత్రునితో) పాప మీతఁ డింక నింటికిఁ దిరిగిపోవ నాసతోనున్నాఁడు. మనకార్యము నిచ్చోట నిర్వర్తించుకొని పోవుదమా?

మం—తడవేల? ఇచ్చట మనల నడ్డుకొనువా రెవ్వరు? ఓయీ! చంద్రికాంతా! ఈ వనమునఁగల వింతలన్నియుఁ దిలకించిపోవ నేతెంచి, యింత త్వరపడెదవేల? పరలోకసుఖములఁ జవిఁగొన నేగువాని కింకఁ దల్లి మొఁ బ్రేమయేల?

చం—(తనలో) ఏమిది? ఈతనిపల్కులు వింతగఁ దోఁచుటయే కాక, భయోత్పాతములై కూడఁ గన్పట్టుచున్నయవి. (ప్రకాశముగా) మిత్రమా! నీ పల్కులయందలి యర్థమును గ్రహింపఁ జాలకున్నాను.

రాజ—ఓరీ! అదేమివింతయగును? ఈవింతను జూడుము.

గీ. హంతకుల నెల్లఁ బట్టియు హత మొనర్చు
నట్టిచోటిది కనుము నీ యాశదీర
భూతపైశాచముల కిది పుట్టినిల్లు
ముదముఁ గల్గించు నీచోటు మూర్ఖులకును.

చం—అయ్యో! హాస్యములకైన నశ్లీలమునుడువఁ దగునా? ఈస్థలము నాకేల ముదమును గొల్పును?

రాజ—ఏలనా? ని న్నీవధ్యశిల నధిష్ఠింపఁజేసెదము.

చం—ఎందులకు?

రాజ—వధించుటకొఱకు.

చం—మిత్రులారా! నిష్కారణముగ నన్నేల చంపఁజూచెదరు. ఎన్నఁడును గలనైన మీ కెగ్గొనరింపఁ దలఁచియుండలేదే.

గీ. సోదరులరీతి మిమ్ములఁ జూచుచుండి
యెదుఱునుత్తర మీయక యీర్ష్యలేక



పరఁగుచుంటిని నాదగు పాపమేమొ
ఖడ్గమున కెరఁ జేయఁగ గతమదేమొ?

ఈనాఁ డీవనమునందుఁగల వింతలఁ జూపెదమని, శిరముదునుమ సిద్ధమగు టేటిన్యాయము? అకారణంబుగ నొరుల హింసింపఁ జేతు లెట్లాడును?

రాజ—ఓరీ! నిష్కారణముగ ననేల?

చం—కారణ మేమి?

రాజ—మీ రత్నమాలను జేకొని సుఖించుటకు.

చం—శివశివా! (అని చెవులు మూసికొని) నా యాతుచ్ఛప్రాణముల కిసుమంతయు వెఱపునొందుట లేదు. కాని, పతివ్రతా శిరోమణి యగు నాపెను జేపట్ట సిద్ధమగుట నీచము కాదా?

(29 అనుబంధము.)

మం—ఇచ్చోట నీ నీతులఁ జెవిఁదాల్చువా రెవ్వరు? ప్రాణములపై నాశవీడి, యావధ్యశిల నెక్కి సంసిద్ధుఁడవు కమ్ము.

చం—సోదరులారా!

గీ. పాప మేమియు నెఱుఁగని బాలకుఁడను
చేతులను మోడ్చి మ్రొక్కెద జీవహింస
రాజులకు ధర్మమే యెందు రాజభక్తిఁ
జూపి వర్తించువాఁడ నే పాపిఁ గాను.

రాజ—ఈ వృథాలాపము లేల? ఎన్నిరీతుల బ్రతిమాలినను, నిన్నుఁ దునుమక విడుచువారము కాము.

చం—అయ్యో! పుణ్యాత్ములారా! నాకు జీవదాన మొసంగి పుణ్యముఁ గట్టుకొనుఁడు. నా జనని నన్నుఁ గానక యెంతయుఁ బరితపించును. దయార్ద్రహృదయులై నన్ను వీడిన నేఁ బోయి యామె నూరడించెద.

రాజ—ఏమేమీ! నీజనని నూరడించుటకై నిన్ను విడువవలెనా? నీ కంతశ్రమ యేల? మేమే యూరట నొందించెదము లెమ్ము.

చం—హా! దైవమా! వీరలబారినుండి నీవైన రక్షింపవా? అన్నలారా!

గీ. కఠినహృదయులై యీవిధి ఽ ఖడ్గమూని
బాలుఁడనకను వధియింపఁ ఽ బాల్పడు నెడ
దిక్కు నా కెవ్వ రిందు నా ఽ దిక్కు మీరె
కనికరంబునఁ బ్రోవుఁడో ఽ కరుణఁ జూపి.

రాజ—ఛీ! నోరు మూయుము. నీ దీనాలాపములచే మామనంబులు కరుగునవి కావు. (మంత్రికుమారుని గాంచి) ఏల శంకించెదవు?

మం—చంద్రకాంతా! శిల నెక్కుము.

(అని ఖడ్గమూని సంసిద్ధుఁడగును.)

చం—నా జననిని యొకమాఱు కనులారఁ గాంచిరానిండు.

రాజ—నీ గొంతెమ్మకోర్కెలన్నియు మానుము. నిన్ను వధింపకమానము. ఇదియే ముమ్మాటికి నిశ్చయము.

చం—హా పరమేశ్వరా! ఎన్నిరీతులఁ బ్రార్థించినను నిర్దయాపరులై వీరలు తమ దుష్టప్రవర్తనను మానమనుచున్నారు.

గీ. ముజ్జగంబుల కాధార ఽ భూతుఁ డెవఁడో?
మూఁడుమూర్తుల కెల్లను ఽ మూల మెవఁడో?
పుణ్యపాపంబు లరయుచుఁ ఽ బ్రోచు నెవఁడో?
అట్టి జగదీశుఁ బేర్కొందు ఽ నార్తిఁదీర్ప.

ఓ! జగదీశ్వరా? ముల్లోకనాథా!

చ. ఎఱుఁగను పుణ్యపాపముల ఽ నేర్పడు చింతలు భారమయ్యె నే
నెఱుఁగను దప్పుఁ జేసి యొప్పు ఽ డెచ్చట నెవ్విధి నైనఁ గాని



నే నెఱుఁగను నిన్నుఁదక్క నెద ఽ నేసదయుల్గలరో యట న్సదా
యెఱుఁగుదు దీనపోషకుఁడ ఽ వెయ్యెడ నీవయటంచు నమ్మియుఁ.

(30 అనుబంధము)

[తెరలో]

ఓయీ చంద్రకాంతా! నీభక్తి యెంతయుఁ గొనియాడఁదగినది. ఈ యస్త్రములఁ గైకొని నీకుఁ గీడొనర్ప నెంచిన నా దుష్టులఁ దునుమాడి, పిదప సకలైశ్వర్యంబులతోఁ దులదూగుచు శాశ్వతకీర్తిని వడయుము.

(అని యశరీర వాణి పల్కుచు శస్త్రములు యెదుటపడ)

చం—(ఆతురతతో వాటిని గైకొని) ఓరీ! దుర్మదాంధులారా! ఇప్పు డెక్కడి కేగెదరు?

గీ. మదమడంచెద నిల్వుఁడు ఽ మాన కిపుడు
దుష్టవర్తనులై నాకుఁ ఽ దోడు లేక
సంహరింపంగ నెంచిరో ఽ సాహసమున
మిమ్ముఁ దెగటార్చి కీర్తిచే ఽ మెలఁగువాఁడ.

రాజ—(మంత్రిసుతుని గాంచి) తొండ ముదిరి యూసరవిల్లియైనది. (చంద్రకాంతునితో) ఓరీ! నీ ప్రగల్భములకే భీతినొంది నిన్ను వీడుదుమనుకొంటివా?

చం—(తనలో) రానురాను దైవకృపచే బల మతిశయించినదే. (ప్రకాశముగా) నీచులారా! నన్ను వీడవలసిన కాలము గతించినది. మదోన్మత్తతచే, పతివ్రతాశిరోమణిని జేపట్ట నెంచి, బాలుఁడనగు నన్నుఁ దునుమ యత్నించిన పాపము మిమ్ములఁ బాసిపోవునా? దుష్టశిక్షణయు, శిష్టరక్షణయు రాజధర్మమగుటచే నట్లొనర్చి ప్రఖ్యాతి వడసెద. మిమ్ము,

గీ. దైవమే ఘాత మొనరుపఁ । దలఁచి నాకు
వరము లొసఁగెను నిల్వఁడీ । వనమునందె
రూపుమాపెద వీడుట । పాపమగును
చేయరానట్టి పనులను । జేయఁ దగునె.

రాజ—ఓరీ! వాచాటా!

ఉ. సంగరమందుఁ జూపఁ దగు । సాహస మేమియొ ప్రల్లదంబులీ
భంగిని బల్కఁగాఁ జనునె । బాహుబలంబును జూపు డింభకా!
భంగ మొనర్చి యస్త్రములఁ । బ్రాణము లార్చెద నీక్షణంబునన్
చెంగున దాఁటగాఁ దలఁచి । ఛీ! యిటు కారుల ప్రేల నేటికిన్.

(జనాంతికముగా మంత్రిసుతునితో) ఈతఁడు భగవదనుగ్రహపాత్రుఁడై యలరారుచుండ, మనము జయింప శక్తులమగుదుమనుట కల్ల. ఎట్లైనఁ దప్పించుకొన యత్నించినను నిరర్థకము. కాన, శక్తియున్నంతదనుకఁ బోరాడి, పరలోకమున కేగుటయే కర్తవ్యము.

మం—సత్యము. సత్యము. నేనే వీనిని రణమున నోడించెద. చంద్రకాంతా!

గీ. దర్పములఁ బల్కినంతనె । తరలిపోదు
రంచు నెంచితివో కల్ల । యడలుటకును
బిరికిపందలు కారుగ । భీతి విడచి
సంగరంబునఁ దునిఖియుఁ । జనెదునరులు.

చం—అగునగును. మీ కన్నిటియెడ నట్టిసాహసమే గలదు.

చ. వెఱువరు పాపభీతిమెయి । వీడఁగ నెట్టియకార్యమైనఁ జే
వెఱువరు పిన్నపెద్దలకుఁ । బ్రేలగఁ జూతురు దుష్టసంగతుల్
వెఱువరు నీచవృత్తులకు । వీరులమంచును బల్కఁ జూతు రే
వెఱపును బాపిరందు యిటు । వేగమె తుత్రించెద శౌర్యమూనియున్.

నా జననినిబట్టి సుఖింప నెంచిన మీరిప్పుడే యీ ఖడ్గమున కెరయై సుఖమందుఁడు.



మం—ఆ బయలున కేగుదమురమ్ము. (రాజపుత్రునిగాంచి) మిత్రమా! ముందుగ నేనే వీనితోఁ దలపడెదను.

రాజ—మంచిది. జయమును గొనిరమ్ము.

(31 అనుబంధము.)

(చంద్రికాంతుఁడును, మంత్రిసుతుండును నిష్క్రమింతురు).

రా—ఆహా! ఏమి వాని సామర్థ్యము?

గీ. బాలుఁడంచును నెంచితి । బాహుబలము
వర్ణనాతీతమై యొప్పె । వసుధ నిట్టి
శౌర్యసంపదఁ గల్గిన । సాహసుండు
పిన్నవయసువాఁ డెవఁడుండు? । వెదకిచూడ

అయ్యో! నా మిత్రుఁడు క్రిందఁ గూలెనే. ఏను పోయి డీకొనియెద.

(నిష్క్రమించును.)

[చంద్రికాంతుఁడు తిరుగఁ బ్రవేశించి]

గీ. దుష్టసంహార మాయెను । దోసకారు
లెల్ల నీరీతి మడియుట । యిపుడు తెలిసె
కలుష మిసుమంతయైనను । గట్టికుడుపు
దాఁటి చరియింప వశమానె । ధాతకైన.

పరభామలఁ బట్టఁజూచు పాపాత్ముల గతి యింతే కదా.

[తెరలో]

అయ్యో! సుకుమారా! ఎంతదూర మేతెంచినను గానరాక నా యీ యార్తనాదముల నేలయాలింపవు? నా యీయరణ్యరోదనమే నీకు వీనులఁ బడకుండెనా?

చం—(వినుట నభినయించి) ఏమది? నాజననియే నాకై రోదనమొనర్చుచు నిటు వచ్చుచుండె. ఎదురేగి సంతసమును గూర్చెద.

(అని యొకప్రక్క కేగును.)

[రత్నమాల ప్రవేశించి]

(32 అనుబంధము.)

హా! రాకుమారా! సుగుణైకనిధీ! చిన్ననాటనుండియుఁ దీరని కష్టములే కూడుచున్నవి కదా. ఎన్నికష్టముల కోర్చియైన నిన్నే దైవముగఁ దలపోసి పెంచుకొనుచుంటినే. ఏనెట్లీదారుణారణ్యంబున నిన్నుఁ గాంచుదాన?

గీ. ఖలులు నినుఁబట్టి వధియింపఁ ✤ గాననమున
వింత లరయుదమంచును ✤ వేడ్కఁ బల్కి
మోసగింపంగ నేలొకో ✤ మూర్ఖుల కిల
దోస మొనరింప వెఱపును ✤ దోఁచ దకట.

(మఱియొకప్రక్క కేగును.)

[చంద్రికాంతుఁడు మరల ప్రవేశించి]

(33 అనుబంధము.)

చం—జననీ! నీ యూర్తారవంబులు చెవిసోకుటయే కాని, నీదర్శనము లభింపకుండె. ఈవనమున కేగుదెంచితిమనియు నీదుష్టులు నన్నుఁ బరిమార్పనుద్దేశించిరనియు నీ కెవ్వరు తెలుప నొంటిమై నన్ను వెదకుచు-నీవనమునఁ జొచ్చితివి? అదిగో! యాదిశనుండి కంఠనాదము వినవచ్చుచున్నది. పోయి చేరెద.

(నిష్క్రమించును.)

[ప్రవేశము:—రత్నమాల.]

(34 అనుబంధము.)

హా! దైవమా! నీకైనఁ గరుణ రాకుండెనా? బాలుఁడయ్యును బతియని నీవు నిర్మించుటచే నదియే మహాభాగ్యమని తలపోసి నిర్విచారమున నుంటిని. తండ్రీ! జగన్నాయకా! నీవు కా కెవ్వరు నా దిక్కు?



గీ. చిఱుతప్రాయపువాఁడైనఁ ✤ జేరి ముద్దు
లొల్కు పల్కుల ననుఁ జేర ✤ నోర్పుమెయిని
యాతఁడే తగుభర్తయం ✤ చరయుచుండి
సంతసింపుచు నుంటిని ✤ సమయ మఱసి.

అట్టితఁడి ననాథగఁ జేయఁదలపెట్టితివా? నాప్రియుని గానక యొక్కనిమిషమైన మనియుండఁగలనా?

సీ. ముద్దుమోమును గాంచఁ ✤ బూర్ణచంద్రుని బోలి
మురిపించి యెల్లర ✤ మోసపుచ్చు
వయసును దిలకింప ✤ బాలుఁడేయగుఁ గాని
పంచశరునిఁగూడఁ ✤ బరిభవించు
కలువరేకులఁ బోలు ✤ కన్నులఁ గనినంత
సుదతులనెల్లర ✤ సొక్కఁజేయు
భానుని పగిదిని ✤ ప్రభఁ గాంచి వెలిగెడు
రాకుమారుఁడె బాసి ✤ వ్యాకులమును

గీ. జేర్చి నెటుపోదు నాతని ✤ జేర నిపుడు
తిరిగితిరిగి వేసారితిఁ ✤ దీర్పఁ జింత
దిక్కులే రెందుఁ దీర్పవే ✤ దీనజనులఁ
బ్రోచు దైవము నీవె నన్ ✤ గాంచుమయ్య.

సీ. నిరతంబు ముదమొంద ✤ నెగడుచుండెడు వాని
కానరే పతి సహ ✤ కారులార!
వయసునఁ జిన్నయై ✤ వన్నెకెక్కెడు వాని
నీక్షింపరే నాథు ✤ నెలగలార!
పరుగున దఱిఁ జేరు ✤ బద్మాక్షు నావిభు
వనమునఁ జూడరే ✤ పక్షులార!

కానరే మీరలు । కాననంబున నాదు
దైవమున్ జందన । తరువులార!
గీ. కటకటా యోర్వఁజాల సిం । గంబులార!
కనులు మూతపడియె నులూ । కంబులార!
ఆశ లడుగంటెను శుకపి । కాములార!
చూపి నావిభుఁ జింతఁ । బాపరయ్య!

అయ్యో! యెవ్వరికిని దయ రాకున్నదే. అగును. పాపాత్మురాలఁ గాంచిన నెవ్వరికి గనికర ముదయించును. ఇంకొకమారు నలువంకలఁ దిలకించి ప్రాణమునే విడెదను. (అని నిష్క్రమించును.)

[తెరలో]

రత్న—ఈమృతకళేబరములఁ జూడ నా నాథుఁడు జీవించియున్నటులఁ దోఁచుచున్నది.

[ప్రవేశము:—చంద్రికాంతుఁడు.]

(35) అనుబంధము.

తల్లీ! ఎంతదూర మఱుఁడెంచినను నిన్నుఁ గానకుంటిని. ఏమి సేయువాఁడ?

[రత్నమాల ప్రవేశించి]

రత్న—హా! ప్రియా! (అని చంద్రికాంతుని గౌఁగిలించికొని) ఏమి నాపుణ్యము. చంద్రకాంతా! నీకై యెంతగఁ బరితపించితిని. ఆ క్రూరుల బారినుండి యెట్లు తప్పించుకొంటివి?

చం—ఎట్లో యననేల? దైవకృపచేతనే.

రత్న—వారు నిన్ను సంహరింప నేల పాల్పడిరి?

చం—నిన్నుఁ జేకొన నెంచి—

రత్న—నన్నుఁ బట్ట నెంచిరి కా. పతివ్రతలకు మానభంగ మొనర్ప నెంచువారలకుఁ గల్గు పాట్లివియే కదా.



చం—ఇఁకఁ బురమునకుఁ బోవుదమా?

రత్న—వలదు. వలదు. వీరిని మడియింపఁ జేసితివని యెఱింగిన నా రాజు నిన్ను వీడునా?

చం—ఇంకను భీతినొందెదవేల? ఏదిక్కును లేక, ప్రార్థింప నా సర్వేశ్వరుఁడు ప్రసన్నుండై, యెందును జయమే కూడునని వరం బిచ్చి యీయస్త్రముల నొసంగె.

ఉ. కోపమునూని యానృపుఁడు । కూడఁగఁ జూచిన సంగరంబునన్
జూపియు నాదు శౌర్యమును । జూపియు శీఘ్రమె బాహుశక్తియున్
యేపున సంహరించి మది । కింపుగ రాజ్యము సర్వసంపదల్
దాపునఁ జేరఁ గందు నిఁకఁ । దథ్యము వీడుము శంకలన్ ప్రియా.

రత్న—ప్రాణేశ్వరా! నీ వంతటివాఁడవే యగుదువు. కాని, నిర్హేతుక వైర మేల?

చం—(ఆశ్చర్యక్రోధభావములతో) ఏమిది? ప్రాణేశ్వరా! యనుచుంటివేమి?

రత్న—మఱేమనవలయు?

చం—ప్రాణేశ్వరా యనన ర్థమేమి?

రత్న—భర్త యని కాదా?

చం—అయిన నన్నట్లేల పిల్చెదవు?

రత్న—భర్తవు కనుక—

చం—(కోపముతో) ఛీ! కులటా! ఏమని ప్రేలితివి? చిన్ననాటనుండియుఁ బెంచి పెద్దవానిగఁ జేసి, తల్లివనుమాటను మఱచి, మదాంధురాలవై, నోటికివచ్చినట్లెల్ల నుడువఁ గడంగితివా?

గీ. పుత్రుఁ డంచును బల్కెడి । బుద్ధి పోయి
భర్త నంచును నెంచితే । పాపమనక

యావనంబున నలరెడు । యఖిలజనులఁ

బట్టనెంతువు కాఁబోలు । మిట్టిపడుచు.

గీ. నీచురాలవు కులటవు । నిన్నుఁ బట్టి

హాతమొనర్చెద నిలువుము । యక్కటకట !

బ్రతికియుండిన దుష్టులు । భారమగుచు

పృథ్వి భరియింపఁ జాలక । పోరువెట్టు.

(36) అనుబంధము.

(అని ఖడ్గమును దీసి నఱుకఁ బోవును.)

రత్న—నాథా ! తాళుఁడు. తాళుఁడు. నాయందు దోసమున్న వధింపఁదగును గాని, యకారణముగ సంహరింపఁ బాడియా. ఈ లేఖను గాంచుఁడు. అన్నియు వెల్లడియగును. (అని పత్రిక నిచ్చును.)

చం—(అంతయును జదివి.) చేయరాని యిట్టి ఘోరకార్యములఁ జేయ దలపడిన నీ కీపత్రికను సృష్టించుట యొకలెక్కయా?

రత్న—ఏను సృష్టించినది కాదు. దైవమే సృష్టించెను.

చం—ఈ తర్కమేల? నిన్ను వధింపకమానను.

రత్న—అయ్యో ! దైవమా ! సకలధర్మంబులకును గర్తవై, కారణభూతుఁడవై, నాకు తేఁబ్రాయపువాని భర్తగఁ జేసి, తుద కెటులనో యాతనిఁ బెంచుకొని సుఖంచెదనని సంతసించుచుండఁ గ్రొత్తగ నిదియొకటి కల్పించితివా ? ఈ కపటనాట్యమేల? నీవే యట్టి యధర్మాత్ముఁడవైన, నింక మానవులా నీతిపరులగుట? అసతినని లోకంబున వెల్లడించుటకా నన్ను జన్మింపఁ జేసితివి? నీవే దిక్కని నమ్మియున్న నొక యబలయెడ నీకాతిన్యమేల? నీకుఁ దెలియనిధర్మములు కలవా ? ఏ నింతదనుకఁ బడినయిడుమలఁ గనకుంటివా? ధర్మాధర్మవివక్షతను మఱచ



నీవా యధర్ములను శిక్షించుట! నిక్కమును దెల్పి, నా నాథునితో నన్నుఁ గూర్పవా ?

చం—ఎంతమోసమును జూపుచుంటివి ! ఇదిగో ! ఈఖడ్గమున నుండి నిన్నుఁ గాపాడనెంచిన భగవానుని నేఁ జూపెద. (అని వధింపఁబోవ) [తెరలో]

ఓచంద్రికాంతా ! ఆగుమాగుము ఈమె మహాసాధ్వీరత్నము. ఈమె పల్కులన్నియు సత్యములు. నీవు శివవంశాసంభూతుఁడవు. ఆమె పార్వతీవంశంబున నుద్భవించినది. కొండొకకతంబున నిల్లు కొంతకాలము మీ రిర్వురీయిల నుద్భవింపవలసివచ్చె. చేకొనుము.

చం—మహాప్రసాదము. ధన్యాత్ముఁడనైతిని. సత్యాసత్యముల గ్రహింపనేరక పతివ్రతాశిరోమణియగు ధర్మపత్నిని వధింప సమకట్టితిని. కిరాతునిచందంబున సంచరించితినే. ప్రాణేశ్వరీ ! తెలియక యొనర్చిన నా తప్పిదములను సైరించి నన్నుఁ జేకొనుము. (అని చేరఁబోవును.)

రత్న—(త్రోసివైచి పోఁబోవును.)

చం—గీ. ఇడుమలను ముంప ధర్మమే । యింతి నీను

సుగుణగణములఁ దెలియక । చూచుచుంటి

రత్న— చాలుఁ జాలును యిది యేటి । సంగమంబు

కూడదెన్నఁడు బుధులకుఁ । గులటఁ జేర.

చం—(తనలో) ఇంతదనుక నెన్నెన్నియో పలుకరాని దుర్భావలఁ బల్కినందుల కీమె తగినట్లు ప్రత్యుత్తర మిచ్చుచున్నది. (ప్రకాశముగా) సఖీ !

ఉ. ధైర్యము రూపుమాసె నయొ । తాల్మియు వేగమె బాసిపోయెగా

శౌర్యముఁ జూపఁగాఁ దగదు । చానరొ ప్రీతిని జేరఁదీయుమా

ఆర్యరో యంచు నింతదను । కాదర మొప్పగఁ జూపుపల్కులన్

భార్యవు నీవె వీడ నిఁకఁ । బాలనఁ జేసెడువార లెవ్వరో.

కాన, నామొఱాలించి పుణ్యముం గట్టుకొనుము.

రత్న—

ఉ. పాపిని గాన నేను పలు భావన లేటికిఁ జేర నేటికిన్
పాపము సంభవించుఁ గద భారము సైపఁగ వీడి యేగుమా
తాపము గల్గనేల మదిఁ దాల్మిని వీడి చరింపఁ బాడియే
కాపుర మేల? యీకులట కాననమందునె యుండు టొప్పగున్.

కావున, వేఱొక సతీతిలకమును బరిణయమాడి సుఖింపుము.

(37 అనుబంధము.)

చం—తపస్వీ!

సీ. చిఱుతప్రాయమునుండి చేరి వేడ్కను బెంచి
పలుకఁ దగునె యిట్లు ప్రాణకాంత!

రత్న—జననినై సుతుని నే సాహసంబునఁ బట్ట
నెంచిన కులట నే నేల నాథ!

చం—యెఱుఁగఁ జాలని వేళ నేర్పడెఁ జింతలు
యత్నమేలనె వీడ రత్నమాల!

రత్న—పాపంబు చేకురుఁ బరవనితను గూడఁ
జనుము పుణ్యంబున చంద్రకాంత!

చం—గీ. మరునిశరముల కోపను మాన్యచరిత!

రత్న— పుడమిభారంబుఁ దీర్పఁగఁ బొల్పు కాదె?

చం— కౌఁగిలిచ్చియుఁ బ్రోవుమా కాంత యిఁకను

రత్న— జేర కేరీతి నిల్తును? జీవితేశ.

(అని యిరువురు కరముల భుజముల నిడికొందురు.)

చం—తరుణీ! చిన్ననాటనుండియుఁ బెక్కుయిడుములంది నన్నుఁ బెంచి, పెద్దవానిగఁ జేసి చేకొనిన నీఋణ మెట్లు తీర్చుకొనఁ జాలువాఁడ?



రత్న—మీ కరుణారసమును వెదజల్లుటయే యందులకుఁ దగినది.

చం—సఖీ! నాజననీజనకులఁ గాంచ నిచ్చవొడముచున్నయది. ఇచ్చోటఁ దడయ నేల? పోవుదము రమ్ము.

[ప్రవేశము:—మారువేషమున చంద్రచూడుఁడు]

చేయరానిపనులఁ జేసినవేళల నెచ్చోటనున్నను, భీతిగనే యుండును. కారాగారమునుండి తొలఁగివచ్చితి ననుకొనుటయే కాని, యీ కాననమందైన నిర్భీతిగ నడువ నశక్యమగుచున్నయది. ఇచ్చోటఁగూడ మనుష్యసంచారమే కనవచ్చుచున్నది. (భీతితో) శత్రువులు కారుగదా. (అటునిటు పరికించి) శత్రువర్గము కాదు. నావలెనే వీరలును నదృష్టహీనులవలె నున్నారు. ఏలొకో నామనమునం దాశాపాశము లంకురింపఁ దొడఁగెను. నాసుతుఁడే జీవించియున్న, నీసరి కీనవమోహనాంగుని వయసున నుండియుండును గదా. అయ్యో! నన్నుఁబోలు దురదృష్టహీనుని కట్టిభాగ్య మొదవునా?

[ప్రవేశము:—చంద్రకాంతుఁడు]

చం—(చంద్రచూడుని గాంచి) ఆర్యా! దాహము మిక్కుటమగుచున్నది. కమండలములోని జలము నొసంగి ప్రాణదాన మొసంగెదరా?

చం-చూ—(తనలో) వీనిపల్కు లమృతధారాపాతంబులవలె నున్నవి. సుకుమారశరీరా! దాహమూర్చగ నింతగఁ బ్రార్థింపవలెనా? ఈ నీటిని గైకొమ్ము. (అని నీటి నొసంగును.)

చం—(నీరు గ్రోలును.)

చం-చూ—(తనలో) ఈతనిఁజూడఁజూడ మోహమతిశయించుచున్నదే. రక్తసంబంధ మించుకయు లేక యిట్టివ్యాకుల ముద్భవించుట కల్ల. (ప్రకాశముగా) [illegible]యా! నిన్నుఁ గనినాతనే ముద్దుఁగొన్న

నభిలాష జనించినది. దగ్గరగ రమ్ము. (అని చేరఁదీసికొని కౌఁగి
లించుకొని) ఆహా! ఏమి యీసుఖము!

గీ. కారణము లేక యీరీతిఁ గలుగ సుఖము
కూడు టెట్టులు? యీతఁడే కొడుకటంచు
మదిని నాసలు చెలరేగి మసలఁదొడఁగె
దైవ మేరీతిఁ దలఁచెనో తలప వశమె.

ఆ వచ్చు కాంత యెవతె? మీర లీవనంబున సంచరింపఁ గతంబేమి ?

చం—ఆర్యా! ఆపె నాప్రేయసి. కొండొకకతంబున నిటులఁ దిరుగవల
సివచ్చె.

చం-చూ—ఆపె నీకంటె వయసునఁ బెద్దది కాదా?

చం—అగును.

చం-చూ— (తనలో) మానసమా! త్వరపడకుము.

[ప్రవేశము:—రత్నమాల]

రత్న—నాథా! ఇంతత్వరితగమన మేల?

చం—ప్రేయసీ! ఈ మహానుభావునికడ జలము లభింప దాహ మా
ర్పుకొంటిని.

చం-చూ—తరుణీరత్నమా! మిమ్ములఁ గాంచినంతనె యత్యానురాగ
ముదయించి సంతసంబును గూర్చె. మీవృత్తాంత మేమియో,
యివ్వనమున కఱుదెంచుటకుఁ గతంబేమియో తెల్పి యూరటఁ
గల్గింపవేఁడెదను.

రత్న—అయ్యా! మీ మనంబునఁ గలశంకలఁ జెప్పుడు.

చం-చూ—సింహకేతునకు రత్నమాల యను నొకపుత్రికారత్నము
గలదు. భగవదాజ్ఞచే నామె నొకబాలున కిచ్చి పరిణయమాచ
రించిరి. వారలే మీరని శంకించుచుంటిని.

రత్న—మహాత్మా! దాచనేల? అగును. మీర లెవ్వరు?



చం-చూ—ఏ నెవ్వరైన నేమి? (అని కన్నుల నీరుబెట్టును.)

రత్న—చంద్రచూడ మహారాజుగారు కుశలంబున నున్నవార లేమో,
మీకుఁ దెలియునా?

చం-చూ—సింహకేతుఁడు, నీవు పురమునుండి తరలిన వెనుకఁ గ్రోధ
మెదఁదాల్చి, సంగరరంగంబునఁ జంద్రచూడు నోడించి, చెఱ
సాల నుంచె.

చం—ఏమేమీ! మదీయజనకుని కారాగార బద్ధునిగ నొనర్చెనుగా!
(సింహకేతు నుద్దేశించి) ఓరీ! నా జనకుని బంధీకృతుగ నొనర్చి
తివికా. సఖీ! ఇఁకఁ గాలయాపన మేల?

గీ. మాయయే యైన నెంచక మత్సరమును
బాపి రణమునఁ జూపెద బాహుబలము
జనకునకు బాధ మొనరింపఁ జను నె యిట్లు
వ్యర్థపుచ్చుట కాలంబు వనిత లెమ్ము.

చం-చూ—కుమారా! త్వరపడకుము. అతని బాహువిక్రమంబెంతయు
వర్ణనాతీతము. ఇదియుఁగాక, చంద్రచూడుఁడు బంధవిముక్తుఁ
డాయెను.

చం—ఎచ్చటనుండెను?

చం-చూ—కుమారా! దాచనేల? ఆ నిర్భాగ్యుఁడను నేనే. ఆ సింహ
కేతుని జయింప మన కిప్డు శక్యమగునా?

చం— (38 అనుబంధము)

రత్న—అట్లు కాదు. ఈతఁడు భగవానునిచే వరములఁ బడసియుండు
టచే నెద్దియు నశక్యముగానిది లేదు.

చం-చూ—అయిన నెంతయు ధన్యుఁడను. పోవుదము రండు.

(అని మువ్వురును నిష్క్రమింతురు.)

(తెర పడును.)



శ్రీరస్తు.

# చంద్రికాంత నాటకము.



## సప్తమాంకము.



సింహకేతుని సభామంటపము.

[ప్రవేశము:—సింహకేతుఁడు, మంత్రి.]

సిం—సచివా! చారు లెవ్వరైన నఱుదెంచిరా?

మం—రాజా! కొంద ఱఱుదెంచి, యాచంద్రచూడునిజాడయే తెలియకుండెనని పల్కినారు.

సిం—ఆహా! ఎట్టిమోసకారుఁడు.

[ప్రవేశ మొక సేవకుఁడు]

సే—దేవా! ఎవ్వరినో యొకబాలుని దోడ్కొని, చంద్రచూడుఁడు మీపైకి యుద్ధమునకు వచ్చెనఁట.

సిం—(క్రోధముతో) ఏమేమి? చంద్రచూడుఁడే వచ్చెనుగా. కానిమ్ము తగినశిక్ష విధించెదను.

[ప్రవేశము:—చంద్రచూడుఁడు, చంద్రకాంతుఁడు]

సిం—ఓరీ అధమాధమా! అధమవృత్తి నవలంబించి, కారాగారము నుండి తప్పించుకొనిపోయినంతనే వీఁడువాఁడనని యెంచితివా? ఇప్పు డెందేగెదవు? తిరుగ నేముఖంబున నిట కేతెంచితివి?

చం-చూ—ఇట్లు గర్వాంధుఁడవై, వృథాలాపము లేల? (చంద్రకాంతుని జూపి) ఈతఁడే నాముద్దులతనయుండగు చంద్రకాంతుఁడు. నీపుత్రికయుఁ గుశలంబున నున్నయది. నిర్హేతుకవైర మేల?



సిం—వారిరువురు సుఖంబున నలరారుచుండుట శుభదాయకమే. కాని, నీ వొనరించిన మోసమునకుఁ దగురీతి బుద్ధిఁగరుపక వీడువాఁడను గాను.

చం—నా జనకునియందుఁ గినుకఁజూచుటయు, నాయందుఁ గృపవహించుటయుఁ గడుసరసముగ నున్నది. అయిన నిరువురము బందుగులమే. లేకున్న శత్రువులమే. రణమునకు సంసిద్ధుఁడవు గమ్ము.

సిం—చంద్రకాంతా!

ఉ. బాలుఁడ వీవు శస్త్రముల । భారము సైపఁగఁజాల వందుచేఁ
జాలునుజాలు సాహసము । చయ్యనఁ బొమ్మిక సంగరంబునన్
మేలములాడఁ జెల్లునొకొ । మీఱిన పిమ్మటఁ జింతకల్గుగా
కాలుని బారిఁజేర నిటుఁ । గాలును దువ్వెద వేల డింభకా!

చం—ఓహో! ఈవేనా బలపరాక్రమశాలివి?

గీ. బాలుఁడను కాక నీదగు । ప్రాణములను
బాపువాఁడనొ గ్రహియింప । భావ్యమగును
భీతికల్గెడు పల్కులఁ । బ్రేలినంత
వెఱచిపోవంగ నే నంత । వెఱ్ఱిఁగాను.

ఉ. భూపతులెల్ల నొక్కమొగిఁ । బోరున నిల్చిన నిల్త్రిగాక నీ
వోపక యుద్ధరంగమున । నోడితినంచును బోవఁజూచి యే
బాపునఁ జేరనెంచినను । దాల్మిని వీడఁగఁజాలువాఁడనే
కోపముఁ జూపి నంతఁ జనఁ । గుఱ్ఱనుగానుర ప్రేలనేటికో.

సిం—ఊరకున్నకొలఁదిని ప్రగల్భము లెక్కుడగుచున్నవే. చెడుకాలము ప్రాప్తించినవేళఁ జెడుగులే మంచిగఁ దోఁచును.

చం—నీ వెన్నినీతుల బోధింపనెంచినను, ప్రాణముతో విడచువాఁడఁ గాను.

సిం—(తనలో) వీనిపల్కుల కెంతయు సంతసము గల్గుచుండెను. కాని, కనికరమూనఁదగు సమయము కాదు. (ప్రకాశముగా)

గీ. ప్రల్లదంబులఁ బల్కుట ౯ పాడిగాదు
కారణము లేక జీవముల్ ౯ కఠినవృత్తిఁ
బాయనేలను వినుము నా ౯ పల్కులన్ని
జాలివాఁడముచు నుండెను ౯ జంపఁజాల.

నీ జనకుండు మోసగించి, చెఱనుండి పోయెను గాన నాతఁడే వధ్యుఁడు.

చం—చెఱసాలనుంచ నాతని తప్పేమి?

సిం—తప్పే లేకుండెనా? ఒకనిని జూపి, యింకొకనికి బరిణయమాచరించిన దుర్బుద్ధి కాఁడా?

చం—అం దాతనిలోప మొకింతయు లేదు. దైవాజ్ఞ యటులుండె.

సిం—ఇప్పు డాతని వధింపమనియు దైవాజ్ఞయే.

చం—ముందుగ నన్నుఁ గెలిచి పిదప నాతనికడ కేగుము.

సిం—అయిన నిదే కానుకొనుము.

చం—నా బాహుబలమును జవిచూపెద.

(39) అనుబంధము.

(అని ముందుగ సమంత్రముగ నస్త్రమును వదలును.)

సిం—అయ్యో! ఈతని బాణము లెంతవాడియైనవి. మూర్ఛతచే ధీరత్వమూనితిఁ గాని, యెదురై పోరనిల్చిన మడియుటయే నిశ్చయము. ఈతఁడు తప్పక యాపరమేశ్వరుని స్వరూపమై వెలుగందుచున్న వాఁడు. నాపుత్రిక సాక్షాత్పార్వతియే. ఏమి నాభాగ్యము! (ప్రకాశముగా) ఓయీ! చంద్రికాంతా! నీ ప్రభావముఁ దెలిసికొంటిని. వయసునఁ బిన్నవాఁడవైనను నవతారపురుషుఁడ వగుటచే నాతప్పులమన్నింపఁ బ్రార్థించుచున్నాఁడను



[ప్రవేశము:—రత్నమాల]

రత్న—నాయనగారూ! నమస్కారము.

సిం—ఇష్టకామ్యార్థసిద్ధిరస్తు. కుమారీ! నీపుట్టువువలన మే మెంతయు ధన్యులమైతిమి. మంత్రివరేణ్యా! పురోహితుల రావింపుము. ఇప్పుడే యీచంద్రికాంతుని నాసకలరాజ్యమునకును నధిపతిని జేసెద. (చంద్రచూడుని గాంచి) బావగారూ! తప్పుల మన్నించి, నా యీకోర్కెను నెఱవేర్పఁ బ్రార్థించుచున్నాఁడను.

చం-చూ—ఆజ్ఞకు బద్ధుఁడను.

సిం—(కిరీటముఁ జంద్రికాంతుని శిరముపై నుంచును.)

(అందఱును దీవెనల నిత్తురు.)

(40 అనుబంధము)

(మంగళము పాడుచుండఁ దెరపడును.)

సంపూర్ణము.



# చంద్రకాంతనాటకము.



## అనుబంధములు

[శ్రీయుత సోమరాజు రామానుజరావుగారిచే
రచింపఁబడినవి.]

### 1. చంద్రహాసుఁడు. బ్యాగ్—ఆది.

ప॥ మంత్రివరేణ్యా! మామకరాజ్యము మహితసుభాస్వితమగుచు
జెలంగునె॥ మం॥

అ॥ ప॥ వింతగ వినమది వేడుకగలిగెను॥ మం॥

చ॥ చోరులు జారులు, క్షుద్బాధాయుతులు
బీదలు రోగులు గలుగకుందురుగద॥ మం॥

---

### 2. మంత్రి. బ్యాగ్—ఆది. (పైమట్టుననె)

ప॥ నృపకులతిలకా। తెలిపెద వినుమా।

అ॥ ప॥ యశగితాఘనమగు రాజ్యవిధానము॥ నృ॥

చ॥ నెలకు మూఁడు వర్షములచే ధారుణి। ఫలితమగుచునుండ పౌర
జానపదులు। తాపరోగ, కంటోదంవిడి శుభ। సంతోషమున
సుఖించుచుండిరో॥ నృ॥

---

### 3. దూర్వాసుఁడు. మోహన—ఆది.

ధన్యుడవో నృపచంద్రా। నీమాన్యతచే మాతపములునిలచెడు॥ ధ॥
అన్యులకేగతి నఘములు సమయును।
సన్న్యాసుల మాకు సన్మానంబేల॥ ధ॥

---



### 4. దూర్వాసుఁడు. బ్యాగ్—తిశ్రగతి.

ప॥ అవమతీ హతగతీ యిక్క నినువిడువరా॥
మునివరు నిటు సలిపితి ఖలా॥ అవ॥

చ॥ తనయులు లేరని। తెలుపవుగా
ఘనదురితము నిటు-సలిపితిగా
నిలుపు మిపుడె-నినువధింతు। నిముషమాత్రమున గనా
ఖలమతి శా। పమునను చా। వగనిను శా। సించెదగా॥ అవ॥

---

### 5. దేవి. భాగేశ్వరి—త్రిపుట.

ప॥ మునినాథ-మా మీద ఘన కోపమా కృపాళూ। ము॥

అ॥ ప॥ కరుణాంధి-దయగాంధి। కృపనెంచుమా యీవేళ॥ ము॥

చ॥ పుడమి నపుత్రకుల। మడలినవారమయ్యా
కడుగ ప్రేమమీర మాకు। గతులు గల్పింపుమయ్యా॥ ము॥

---

### 6. చంద్రహాసుఁడు. హిందోల్—కురుజంపె.

కంఠాభరణ శేష। కైలాసనగవాస
గాయక వినోదా। కమనీయ ధీవినుత॥ కం॥
ప్రమథగణకమల భవ। దనుజహత శంకర హర నమోస్తు॥ కం॥

---

### 7. చంద్రహాసుఁడు. బ్యాగ్—రూపకం.

శివశంకరవిశ్వంభర గంగాధరా। హేశూలధరా, హేశూలధరా॥
హేపాపవిదూరా। కలుషహరణ శశిధరా।
భువనసంచరణ అసురసంహరణ। పరమపురుష విగతకలుష
విబుధనుతా। శుభచరితా। రిపుహతా। మునిహితా॥ శి॥

---

బుద్ధిసాగరుఁడు. హిం॥ తోడి—ఆది.

హానితాంతరతుకా- మహేశ్వర। హాకృపాబ్ధి న- న్నే మొనర్తువో॥

ఘూనినాడ ఘనకార్యము నాదల। ఫలిత మెటులఘటియింపగ జేతువో

ఏగతిసలిపెద నేమియొనర్చెద । నేమిపాటు నానొసటనుగలదో

చంద్రిచూడు నా- నతియెటుజరుగునో ।

సన్నుతాంగ నినునమ్మితినీశ్వర॥ హా॥

---

9. డైలాగు—ఆది.

క—అదేవచ్చుచున్నాడు నీవిభుం । డడలుమాని ధైర్యముగనవే చెలి॥

పదములు కదలిన ధ్వని వినబడనే ।

పటముననుగని నతఁడు గనఁబడెనే॥ అ॥

ర—చాలు చాలు పరిహాసము లే

క—సరి సరిలే యిదియొక వేసములే

ర—నను నేమిటి కుడికింపదలతువే

క—నవ్యకోమలాంగుడు కనుగొనవే॥ అ॥

---

10. కపటచంద్రికాంతుఁడు—ఆది.

ఓ హా మానసమా చలి యింపకుమా భ్రమియింపకుమా॥ ఓ॥

తరుణికుచయుగము నవలోకించి ।వనరుహసమవదనము బొడగాంచి

భ్రాంతిమునిగి నను గలచకుమా-వి ।

భ్రాంతిమునిగి నను గలచకుమా॥ ఓ॥

రమణిని గనుగొని రక్తమాంస పూ ।

రితపాంచాలిక యనుకొమ్మా॥ ఓ॥

---



11. రత్నమాల. జంగ్లా—ఆది.

కనుగొనుమా రమణీ న । న్ననయము నీకృప॥ కను॥

మనమున నేమని మానము దాల్చితో । మారసమాను కు

మారాకార । ఘనసుఖకరమున । కౌగిలి యిమ్మా ।

నను నీదాసిగ నేలుకొమ్మా॥ క॥

(షేర్) ఓమదీయ మానసచోరా । మనసిజాకారా ।

మదనుసాయకాగ్నులకు నోర్వజాలరారా

(త్రిశ్రగతిమిశ్ర) కష్టహరణ । కలుషహరణ । కమలనయన రారా।

అలలలలల । అలలలలల॥ కను॥

---

12. కపటచంద్రికాంతుడు. శ్రీరాగం - త్రిశ్రగతి.

బా। లా । యేలనీవు భ్రాంతిమునుగగా । న్యాయమా ।

శ్రేయమా । భావితో । పాయమా॥ బా॥

సకలమునకు । నఖిలపతిని । సన్మతిని దలంపుమా ।

వికలివగుచు-వికలమతిని । నిహసుఖముల దలతువా ।

వలదుపో । సుదతిరో॥ బా॥

---

13. రత్నమాల. బ్యాగ్—తిశ్రగతి.

అలలలలల-నాథేశ్వర । యీవిధముగ సల్పదగునె । యిది గన

ఘనమే॥ అల॥

ఎటులబరిణయము సలిపితి । విటుల కఠినతనుగనా ।

నీకిది మరియాదగా । మోసము నిటుసలుపగా ।

తరుణి యుసురు దగులుననుచు । దలపక నిటులాడగా ।

దురితముగద పెండ్లియాడిన । గరితను విడనాడుట॥ అల॥

---

### 14. డైలాగు. బ్యాగ్—ఆది.

మదవతినను। నీవిధమున గని। కాము బారికయి। కలియగదగు నా
తొలగు తొలగు మడియాశలు విడువుము ।
దురాకాంతు గని । దోషము సలుపకు॥ మో॥
రత్న—సాధ్వికి పతిదైవముగా ! సన్నుతమతి న్యాయముగా ।
నాతోడ నిటులనాడ । న్యాయమె హృదయేశ్వరా॥
కప—తలపకుమా । యాకోరిక మదిదలపకుమా ।
కలతవడియె నెద । కలుషసుఖములను॥ దల॥
రత్న—నీపదముల నంటితిగా । నీవె సకలమాటిగా ।
నాపాపములనుదోలి । నను గరుణనుగనవుగా ॥
కప—ఓమద॥

---

### 15. రత్నమాల. మోహన—ఆది.

ఇకవిడువను నిను । ప్రకటమతీ ।
యేలుకొనుము నను వేడితి సుమతీ॥ యి॥
కరుణింపవుగా । కరుణా । భరణా ।
పరమాదరణా । పాలింపుము ధృతి॥ నిక॥

---

### 16. రత్నమాల. బ్యాగ్—రూపకం.

హా ప్రాణనాయకా ననుబాసిపోతివా హా॥ హా॥
ఒంటిగా నన్విడువ నేనే । మంటినో దయామయా ।
గెంటి నన్ను ద్రోసిపోవ । న్యాయమామెనా ।
నేనెటులసైతునూ నేనేమిసేతునూ॥ హా॥

---

### 20. రత్నమాల. బ్యాగ్—త్రిశ్రగతి.

ప॥ కృపాకరా దయాకరా । పరాత్పరా॥ కృ॥



అ॥ ప॥ నృపాల పాల నిర్మలా నమోస్తుతే॥ కృ॥
చ॥ హేదుష్టదనుజనాయకహాత । ధీనుతవినుతా ।
సతం । బునీ । పదం । బులే । నాకుశరణమో॥ కృ॥

---

### 21. రత్నమాల. ఫీలు—ఆది.

ప॥ కరుణింపవేమి స్వామీ । దరిజేర్ప రావదేమి॥ క॥
1 పరమార్త నన్ను గావా । తరిగాదా దేవదేవా॥ క॥
2 భరియింపలేను బాధా । పరమేశా నాతోవాదా॥ క॥
3 దురితాత్మునయ్య నేను । వరదాస కామధేనూ॥ క॥

---

### 22. అశ్వినీదేవతలు. శుద్ధసావేరి—కురుజంపె.

ప॥ శుభమస్తు విజయోస్తు । సతతము నభయమస్తు॥ శు॥
అ॥ ప॥ రవివంశసుకుమార । రాజేంద్రసుత నీకు॥ శు॥
చ॥ ఖలదానవార్భాట । ములకు మది చలనమును ।
వహియింపకే జయము । వడయుదు వనుపమముగ॥ శు॥

---

### 23. చంద్రచూడుఁడు. జంగ్లా—ఆది.

మహావిపదంధకారమునంబడి ।
యహా పరితపించెద నామనమున॥ మహా॥
అహో యీకారడవి విడివడ నేదియు ।
పాయము నాకిక । నేమియుదోపదు॥ మహా॥

---

### 24. చంద్రికాంతుఁడు, బాలురు. బ్యాగ్—ఆది.

బాలకులారా । బాలకులారా । వసతరువరములనాడుదమా॥ బా॥
మేలుమేలు ధరణీరుహములవియు । పిల్లిమిరియముల నేయుడవా ।

మొల్లలు మరివిరిజాజులు తెల్లనిజాజులు సంపెంగలూ
ఖొల్లలుగగోయుదమా మరిగోడిబిళ్ళలలాటాడుదమా॥ బాల॥

---

## 25. చంద్రికాంతుఁడు—శ్రీరాగం.

ఈనగముల । కీమృగముల । కేనగడును ।
జెందెదననుచు దలచితివేమో॥ ఈ॥
నాపరాక్రమమును నీదుమానసమున గురుతింపవు ।
వీనిసైతునా। దుర్మించివేతునా ।
యింకగాతునా । భీతిగాంతునా॥ ఈ॥

---

## 26. డైలాగు—రూపకం.

చంద్రి—అమ్మ గజమునిమ్మిక నీలేడి గూడి యాడనే । లేడిగూడియాడనె । నే । నేది గూడి యాడనే । ఏనుగనెక్కెద । హాయిగాదోలెద । ఊ—ఊ ఊ॥ అమ్మ॥

రత్న—ఏనుగేడ నీవేడ । ఆడుకొనుటలేడరా । లేడిగూడి యాడరా । వాడిపల్కుమానరా॥

చంద్రి—ఊ ఊ ఊ॥

రత్న—రా రా రా॥

చంద్రి—రానుపో రానుపో రానుపో ప్రియా॥

రత్న—ఏలరా?

చంద్రి—చాలు లే॥

రత్న—రాకయున్న నిన్నుబట్టి । రాపుజేతు చూడరా॥

చంద్రి—రాపుసేతువంటివీ సరె రాను రాను రాను పో॥

రత్న—ఏమియు సేయను సుందర రా రా॥

చంద్రి—ఏమైన జేసిన నేగతివాకూ॥



—సుగుణోదయ । సదయానయ । నిన్ను విడువజాలనురా॥
—అమ్మ॥

## 27. డైలాగు.

—ఓరి వెధవల్లారా చంపేస్తా యిట్లారిస్తే ।
చదవండిరా యిటురండిరా॥ ఓరి॥

ఒ—కారణమున్నది కొట్టకుపంతులు । కడుపులోన నొప్పొచ్చిందయ్యా । పైత్యముచేసిందయ్యా మాకు । పచ్చిపాలుదానికి మందూ॥

౧—ఓరివెధవ ల్లారా మదించిచస్తున్నారా కొంటెతనము । పేక బెత్తమిదిగో మీవీపుచెండుతానురా॥

—ఏమీ యెరుంగము । యొదులకయ్యా ।
మెల్లపుడూమము గొట్టెదవూ ॥

పం—ఓరి॥

## 28. డైలాగ్. బ్యాగ్—ఆది.

ః } నడు నడువుమింక । చటులభీకరాటవుల । తడబడక నెదుట॥
త్రి } చెడుగా । నడుదా। రిని భయపడ ని । యెడ నేమొవరించితి
మారా॥ నడు॥

•—అనఘులార ననునీడ్వకుడీ। నను నీవిధిపడలాగకుడీ । మనమందున దయగని ననుమనుపుడు మానఘనులు సదయాత్ములగుచు॥

ాజ } నడు॥
ంత్రి }

*

### 29. డైలాగ్. బ్యాగ్—ఆది.

రాజ మంత్రి — ఓరోరీ నిను ద్రుంపగనిటు ని । న్నీడ్చితిమిక సైరింపః
పారిపోకుమిక గసిమసంగినిను బటాపంచలొనరింతు

చ—అయ్యలార నేనపరాధంబుల । నియ్యెడనేమొనరించితి ।
జెపుడీ । చయ్యన మీదగు గృపాణమున కా ।
హారము నేయగ హేతువదేమీ॥

రాజ మంత్రి — ఓరోరీ । కారణముల వెదు । కఁగనేలా నీకన్నతల్లి నే
వురా । కరకువాలమున గసిమసంగి సతి । గవయుడ
డింభకుఁడా॥ ఓరో॥

---

### 30. చంద్రికాంతుఁడు. పూరి—ఆది.

ఓంకార భవశక్తీ । శ్రీ శాంకరీయవతారశక్తీ॥ ఓం॥
సకలలోక సంహారహారిణీ । ప్రకటోద్భవ లయకారకారిణీ ।
బ్రహ్మరుద్రచిద్రూపధారిణీ । ప్రపంచమాయాధేయచారిః
శుభ్రజ్యోత్స్నాంబరసమ్మోదా । శుద్ధమాయా స్వరూపవిః
నభ్రప్రోజ్జ్వలశాత్రవ భయదా । అనుపమానరక్తాననవరః

---

### 31. బ్యాగ్—ఆది.



చంద్ర—ఛీ దురాత్మ చెండెద ఖండించెద ।
సిగ్గుసెగ్గు లేకిటుల్ బలుక॥ ఛీ॥
పాపమా నహంభావమా । కడుమోసమా చటులదోః
నన్ను ద్రుంచినా జనని నిగవయుద । లంచినట్టినిను వధియింౘ

---

